# పద్మపూజ

## (కథల సంపుటి)

విశ్వకవి రవీంద్రుడు

అనువాదం:

కె. వి. రమణారెడ్డి

విశాలాంధ్ర ప్రచురణాలయం,
విజయవాడ.

# ఇందులో ........

# "నాకో కథ చెప్పవే"

మాటలాడనేర్చిన వెంటనే పసిపాప "నాకో కథ చెప్పవే" అని అడుగుతుంది.

"అనగా అనగా ఒక రాజకుమారుడూ, అతని సావాసగాడైన మంత్రికుమారుడూ—" అని అవ్వ కథ మొదలు పెడుతుంది.

ఇంతలో అవ్వకు అడ్డుగావచ్చి, బడిపంతులుగారు "మూడు నాలుగులు పన్నెండు" అని కథను ఆపివేస్తాడు.

పిల్లలు బాగుపడవలెనని కోరుకొనేవాళ్లు "మూడు నాలుగులు పన్నెండు; యిది నిజం; రాజకుమారుడి కథ అంతా కట్టుకథ; కాబట్టి—" అంటూ పసివారి చెవులు బ్రద్దలయ్యేటట్లు అరువసాగుతారు.

కాని ఈ ఘోష పసివాళ్ల మనసులలో నాటుకోదు. రాక్షసులను రాజకుమారుడు హతమార్చిన యేవో దూరపుసీమలకు, రూపురేఖలు లేని లోకాలకు పసివాళ్ళ మనసులు యెగిరిపోతాయి. ఎంత గొప్ప గణితానికైనా సరే అక్కడికి యెగిరిపోవడానికి రెక్కలు లేవు.

పిల్లల బాగుకోరినవాళ్లు తలలు వూపి, "చెడిపోయారు; పనికిమాలిపోయారు; దెబ్బకుగాని బుద్ధిరాదు" అని అంటారు.

బడిపంతులు అవ్వనోరు మూసివేశాడు. కాని. కథలు చెప్పేవారికి లోటులేదు. ఒకరు పోతే, యింకొకరు చెప్తారు. పిల్లలబాగు కోరినవాళ్ళు "ఇవన్నీ అబద్ధాలు, కల్పనా కథలు" అని నోరు నొప్పిపుట్టేటట్లు కంఠశోషగా లబోదిబో కొట్టుకొంటారు. కాని, అంతా వృధాప్రయాస.

ప్రాథమిక పాఠశాలనుండి ఉన్నత పాఠశాలవరకు, ఉన్నత పాఠశాలనుండి కళాశాలవరకు పసిపిల్లలను మార్చవలెననే ప్రయత్నాలు జరుగుతూనే ఉంటాయి. "నాకో కథ చెప్పవే!" అని వాళ్ళు అడగడం మట్టుకు ఎప్పుడూ మానరు.

ప్రపంచమంతటా. ప్రతి యింటిలోనూ ఏ యేటికాయేడు కథలు గుట్టమీద గుట్టపడేటట్లు పెరుగుతూనే ఉంటాయి. కొన్ని వ్రాతరూపేణ. మరికొన్ని మాటరూపేణ వెలువడుతూ ఉంటాయి. మనిషి యింతటి బరువైన. విలువైన వారసత్వాన్ని మరే యితర రంగంలోనూ సంపాదించలేదు.

పిల్లల బాగు కోరినవాళ్ళు ఒక విషయాన్ని గురించి అసలు సరిగా ఆలోచించలేదు. కథలు అల్లడమనేది బ్రహ్మదేవునితో బాటే మొదలైనది అనే విషయాన్ని వాళ్ళు గమనించనే లేదు. సృష్టికర్తకే యిది అలవాటైపోయి వుంది. సృష్టికర్తకు యీ అలవాటును పోగొట్టగలిగితేనే తప్ప మానవమాత్రులకు పోగొట్ట వీలులేదు.

అనగా అనగా. ఎంతోకాలం క్రిందట తన పనిశాలలో సృష్టికర్త పంచభూతాలను కల్పించసాగాడు. ఆ నాటికి యీ మహా ప్రపంచమంతా ఆవిరులు క్రక్కుతూ వుండేది. శిలలూ, లోహాలూ పేర్పులు పేర్పులుగా వుండేవి. ఆ రోజునగాని మీరు

బ్రహ్మదేవుని చూచివుంటే ఆయనకు శిశుహృదయం వుందని మీరు అనుకొని వుండరు. ఆయన ఆనాడు చేసిన పనిని యీనాడు వస్తుసంబంధమైనదని అంటున్నాము.

అప్పుడే ప్రాణం మొదలైంది. పచ్చిక యెదుగసాగింది. చెట్లు పుట్టుకొచ్చినవి. పక్షులూ, మృగాలూ, చేపలూ తయారైనవి. కొన్ని గూళ్ళు చేసికొన్నవి. కొన్ని భూమిమీద పరుగులిడినవి. సంతానాలను సృష్టించినవి. మరికొన్ని నీటిక్రింద దాగినవి.

యుగాలు గడిచినవి. అంతట ఒక రోజున చిట్టచివరకు బ్రహ్మదేవుడు మనిషిని సృష్టిచేశాడు. ఆనాటివరకు బ్రహ్మదేవుడు కొంతకు కొంత శాస్త్రవేత్త, కొంతకు కొంత శిల్పి; కాని, ఆరోజునమట్టుకు ఆయన సాహిత్య కళాకారుడైనాడు.

కల్పనాకథలమూలాన ఆయన మనిషిలోని ఆత్మను బయల్పరచసాగాడు. జంతువులు తింటున్నవి, నిదురపోతున్నవి, కంటున్నవి, పిల్లలను పెంచి పెద్దచేస్తున్నవి. కాని మానవుని బ్రతుకు జంతువుల బ్రతుకు వంటిది కాదు. కథలలో కనిపించే విషయాల వంటివి మానవుని బ్రతుకులో కనిపిస్తున్నవి. ఒక ఉద్రేకం మరొక ఉద్రేకంతో ఘర్షణ పడినప్పుడు, వ్యక్తికీ, సమిష్టికీ నడుమ ఘర్షణ యేర్పడినప్పుడు, మనస్సుకూ, దేహానికీ ఘర్షణ కలిగినప్పుడూ, కోరికకూ, తిరస్కృతికీ ఘర్షణ యేర్పడినప్పుడు ఎన్నో సుడిగుండాలు అడ్డువచ్చేవి. ఈ సుడిగుండాల గుండానే మానవుని చరిత్ర నడచి ముందుకు పోతున్నది. నది అనేది ప్రవహిస్తున్న నీరు. మానవుడు అనేవాడు అట్లాగే ప్రవహిస్తున్న కల్పనాకథవంటివాడు. ఇద్దరు మనుష్యులు కలిసికొనగానే "ఏమిటండీ సంగతులు? ఆ తర్వాత యేమి జరిగింది?" అని తప్పనిసరిగా ప్రశ్నించుకొంటారు. ఈ ప్రశ్న

లకు సమాధానాలు అన్నీ కలగలిసి భూమిని అంతటినీ చుట్టివేయ గల గొప్ప వల అల్లికగా తయారైనవి. జీవితకథ అంటే ఇదే. మానవుని వాస్తవచరిత్ర యిదే!

కథలూ, గాథలూ కలిస్తే మన ప్రపంచం యేర్పడుతుంది. మానవునికి అక్బరు, అశోక సమ్రాట్టుల చరిత్ర ఒక్కటే వాస్తవం కాదు. అమూల్యమైన మణిని వెదకి సాధించడానికి సప్తసముద్రాలను దాటి వెళ్ళిన రాజకుమారుని కథ కూడ వాస్తవమైనదే. మానవుని దృష్టిలో చరిత్రలోని వ్యక్తి యెంత నిజమో కల్పనా కథలలోని వ్యక్తి కూడ అంతే. ఈ రెంటిలో ఏది ఎక్కువ, నమ్మదగినది అనేది ముఖ్యం కాదు. ఏది ఎక్కువ విని, చదివి ఆనందించదగినది అనేదే ముఖ్యం. మానవుడు గొప్ప కళాఖండం! అతని సృష్టిలో - బ్రహ్మదేవుడు యాంత్రికానికి గాని, నైతికానికి గాని ప్రాముఖ్యము యివ్వలేదు. ఆయన మానవునికి భావనాబలాన్ని, కల్పనా శక్తిని యెక్కువ ప్రసాదించాడు. మనిషి బాగుకోరినవాళ్ళు యీ వాస్తవాన్ని తెర మరుగు చేయవలెనని ప్రయత్నిస్తారు. కాని, నిజం అనేది నిప్పు వంటిది. అది గప్పున మండి తెరను కాల్చివేస్తుంది. చిట్టచివరకు తెల్లమొగాలు వేసి మానవుని హితాభిలాషులున్నూ, బడిపంతు ళ్ళున్నూ కలిసి కల్పనాకథలకూ, నీతినియమాలకూ రాజీచేయ ప్రయత్నిస్తారు. కాని ఆ రెండూ, ఒకదాని నొకటి కనాకండలుగా నరుకుకొనేందుకు తప్ప కలిసికోవు. ఆ విధ్వంసనమంతా గుట్టలు గుట్టలుగా ప్రోగుపడివున్నది.



# ఆట బొమ్మలు

మహారాజుగారి భవంతిలో, ఒక శిల్పి పసిపిల్లలకు ఆట బొమ్మలు చేస్తూ వుండేవాడు. ఏటేటా, భవంతి లోగిలిలో, బొమ్మల కొలువు జరిగేది. ఆ శిల్పి పనితనానికి తగిన గౌరవం, మర్యాద అప్పుడు లభించేది.

ఆ శిల్పికి ఎనభై ఏళ్ళు వచ్చాయి. ఇంతలో కిషన్‌లాల్ అనే కొత్తశిల్పి ఒకడు ఆ నగరానికి వచ్చాడు. అతను కుర్ర వాడు. ఆటబొమ్మలను సరికొత్త రీతిలో తయారు చేస్తాడు. కావలెనని, అతను ఆటబొమ్మలను పూర్తిగా చేయడు. సగం మట్టుకేచేసి వదిలిపెట్టేవాడు. వాటికి అతను పూసినట్లుగా, రంగులను మరెవ్వరూ పూయలేరు.

"అదురు బెదురులేని నేర్పు అంటే యిదే" అన్నారు కొత్తకారు వాళ్ళు.

"ఇదేనా నేర్పు? వట్టి సిగ్గుమాలిన తనం!", అని అసహ్యించుకొన్నారు పాతకారు వాళ్ళు.

కాని కాలం మారింది. రుచులుకూడా మారినవి. "ఈకొత్త రకపు బొమ్మలే కావాలి", అని రాజకుమార్తెలు అడిగారు.

రాజకుమార్తెలకు ముసలి పరిచారకులు వుండేవాళ్ళు. వాళ్లు రాజకుమార్తెలను వారించబోయారు. కాని రాజకుమార్తెలు మొండి పట్టు పట్టారు.

వృద్ధశిల్పి దుకాణానికి మునుపు వచ్చినంతమంది యిప్పుడు రావడంలేదు. అమ్ముడుపోని ఆటబొమ్మలు వరుసలుదీరి ఉంటున్నాయి. ఏరుదాటవేసే పడవ తిరిగి వస్తుందని, ఏటిరేవున దాని కోసం ఎదురుచూచే ప్రయాణీకులవలె ఉన్నాయి ఆ బొమ్మలు.

రెండేళ్ళు గడిచినయి. వృద్ధశిల్పి పేరు తలుచుకొనేవారే లేకపోయారు. మహారాజుగారి భవంతిలో బొమ్మల కొలువులు నడిపే గౌరవం యిప్పుడు కిషన్‌లాలుది.

ముసలి శిల్పికి వుత్సాహం కృంగిపోయింది. బ్రతుకుతెరువు కూడా పలుచబడింది. అతని కొక కూతురు. ఆమెకు పెండ్లి అయింది. ఒకనాడు ఆమె తండ్రి దగ్గరకు వచ్చి "మా యింటికి వచ్చి వుండు నాయనా! చివరిరోజులు హాయిగా చింత లేకుండా గడుపుదువుగాని, రా నాయనా" అని అడిగింది.

ముసలి శిల్పి కూతురు ప్రొద్దు పగలస్తం యింటిపనిలో చేయి తెమలకుండా పడివుండేది. ఆమె పెనిమిటి ప్రమిదలు చేసి, చుట్టుప్రక్కల బస్తీలలో అమ్ముకొంటూవుండేవాడు,

రోజులూ, రోజులతోపాటుగా రుచులూ మారిపోయినవనే సత్యాన్ని ముసలి శిల్పి గమనించనేలేదు. తన మనుమరాలు పదహారేళ్ళ యెలజవ్వని అయినదన్న విషయాన్ని కూడ అతను గుర్తించనేలేదు.

పంట పొలాలలో కూర్చుని, పిట్టలను తరుముతూ తోలి వేస్తూ, ముసలిశిల్పి కునుకుపడ్డాడు. ఇంతలో మనుమరాలు వచ్చి తాత మెడను తన చేతులతో చుట్టివేసింది. అతని నరనరమూ సంతోషాన వణకిపోయింది.

"నాకో ఆట బొమ్మ చేసి యివ్వు, తాతయ్యా" అని అడిగింది.

"అల్లాగే కాని, నీకు నా బొమ్మలు నచ్చవేమోనమ్మా" అన్నాడు శిల్పి.

"నీకంటేకూడా ఎవరు బాగా చేయగలరు చెప్పు" అని అడిగింది.

"ఎందుకు చేయలేరు? కిషన్‌లాలు వున్నాడుకదా!" అన్నాడు శిల్పి.

"అతనా! వట్టిమాట" అన్నది మనుమరాలు.

వాళ్ళిద్దరూ ఆ విషయమై వాదించుకొన్నారు. చివరకు ముసలిశిల్పి లేచి, పనిముట్లు తీసికొచ్చి బంకమట్టిముద్ద తెచ్చి, కళ్ళకు అద్దాలు తగిలించుకొని కూర్చున్నాడు.

"అమ్మాయ్! నేను బొమ్మ చేస్తూకూర్చుంటే యెట్లా? పిట్టలు వచ్చి ధాన్యం తినిపోతాయేమో!" అన్నాడు.

"నేను తరుముతూవుంటానులే, తాతయ్యా" అంది మనుమరాలు. ఎండ తగ్గిపోసాగింది. ఆవుల మెడమువ్వల ఘల్ ఘల్ ధ్వనులు దూరంనుండి వినవస్తున్నవి. పసిపిల్ల కాకులను తరిమికొట్టుతోంది. ముసలిశిల్పి బొమ్మలను చేస్తున్నాడు.

ఒకరోజు ప్రొద్దున ముసలిశిల్పి బొమ్మలు చేస్తూ కూర్చుని వున్నాడు. ఇంతలో అతని కుమార్తె అంగలు వేసికొంటూవచ్చి, "సుభద్రకు నెత్తికి యేళ్ళువచ్చాయి కాని, యింటిపని పట్టించు కోవడమేలేదు. కాలమంతా పనికిమాలిన పనులలో వెళ్ళబోస్తూ వుంది. నీ ఆసరాలేకుంటే అది కుదురుగా వుండేది. బొమ్మలతో ఆటలాడుకోవడం యికనైనా ఆపివేయాలి. ఏమంటావు?", అని అడిగింది. "నిజమే నమ్మా! కానైతే యీ బొమ్మలను నేను మహారాజుగారి పిల్లలకోసం చేస్తూ వున్నాను. వీటిని అమ్మితే పైకం వస్తుంది. దానిని పెట్టి మన సుభద్ర పెళ్ళికి యేదో కానుక వస్తువు కొందామని వుంది", అన్నాడు వృద్ధ శిల్పి.

కుమార్తెకు విసుగు పుట్టింది. "నీ బొమ్మలు కొనేవాళ్లు ఎవరూ వుండరు". అని యెత్తి పొడిచింది.

వృద్ధశిల్పి తలవంచుకొన్నాడు. కాని సుభద్ర వూరుకో లేదు. "తాతయ్య బొమ్మలు ఎట్లాకొనరో చూస్తాను". అన్నది.

ఇది జరిగి రెండురోజులయింది. ఆరోజున సుభద్రవచ్చి, తల్లిచేతిలో బంగారు రూకను పెట్టింది. "తాతయ్య బొమ్మలు అమ్మగా వచ్చిన పైకం", అని వివరించింది.

అమ్మ ఆశ్చర్యానికి మితిలేదు. "ఎక్కడ సంపాదించావో చెప్పు?" అని అడిగింది.

"మహారాజుగారి భవంతిలో", అని సుభద్ర జవాబిచ్చింది.

వృద్ధశిల్పి వుబ్బితబ్బిబ్బైపోయాడు. "చూశావూ? నా కంటి చూపే గనక మందగించకుంటేనా, నా చేతులేకనక వణకిపోకుం టేనా –" అన్నాడు.

అమ్మ సంతోషించింది.

"ఇటువంటి రూకలు పదహారు వుంటే, సుభద్రకు బంగారు కంఠహారం వస్తుంది" అన్నది.

"దిగులుపడకు. త్వరలో హారం వస్తుంది" అని వృద్ధ శిల్పి ధైర్యం చెప్పాడు.

"తాతయ్యా, నాకు తగిన పెళ్ళికొడుకు కోసం మీరెవ్వరూ అట్టే బాధ పడనక్కరలేదు" అని సుభద్ర తాతతో మెల్లగా చెప్పింది.

వృద్ధశిల్పి నవ్వుకొన్నాడు, కంటినుండి జారిన నీటిబొట్టును తుడుచుకొన్నాడు.

అతనికి తిరిగి పసితనం వచ్చినట్లయింది. చెట్టు నీడలో కూర్చుని, వృద్ధశిల్పి బొమ్మలు చేస్తూవుంటే, సుభద్ర కాకులను తోలివేస్తూవుండేది. దూరంనుండి ఆవుల మెడ మువ్వల ఘల్ ఘల్ ధ్వనులు వినవచ్చేవి,

ఒకటి వెంబటి మరొకటిగా పదహారు బంగారు రూకలు సమకూరినవి. కంఠహారం కొనుగోలు చేశారు.

"ఇక పెళ్ళికుమారుడు రావడమే తరువాయి" అన్నది అమ్మ.

సుభద్ర తాత చెవిలో, "తాతయ్యా, పెళ్ళి కుమారుడు తయారుగా వున్నాడు", అని వూదింది.

" ఎక్కడ చూచుకొన్నావమ్మా ", అని వృద్ధశిల్పి అడిగాడు.

"మొట్టమొదట నేనుమహారాజుగారి భవంతికి వెళ్ళినప్పుడు, 'నీకేం కావాలి' అని ద్వారపాలకుడు అడిగాడు. రాజకుమార్తె

లకు బొమ్మలు అమ్మగోరుతున్నానని నేను బదులు చెప్పాను. ఈ బొమ్మలు పనికిరావని చెప్పి. అతను నన్ను లోపలికి పోనీయ లేదు. నాకు ఏడుపు వచ్చింది. పోయిన దారినే తిరిగివస్తూవుంటే, ఎవరో ఒకాయన ఎదురుపడి, నన్ను ఆపాడు. 'బొమ్మల దుస్తులు కొద్దిగా మార్చితే. అవి బాగా అమ్ముడు పోతాయి' అన్నాడు. తానే మార్పుచేస్తానన్నాడు. చేశాడు. ఆయన నీ మనసుకు సరిపోతే చాలు. తాతయ్యా. అతనిని పెళ్ళిచేసికోవ డానికి నా కేమీ అడ్డు వుండదు. సంతోషంగా అతని భార్య నవు తాను", అన్నది సుభద్ర.

"అతగాడు ఎక్కడ వున్నాడిప్పుడు ?". అని వృద్ధశిల్పి ప్రశ్నించాడు. "అడుగో — ఆ చెట్టుకింద", అని చూపించింది సుభద్ర.

ఇంతలో ఆ క్రొత్తమనిషి తానే గదిలోకి వచ్చాడు.

వృద్ధ శిల్పి అతనిని తేరిపార జూచాడు. "ఇతనేగదా కిషన్‌లాల్ ?", అన్నాడు.

కిషన్‌లాలు వంగి, వృద్ధిశిల్పి పాదాలను తాకి," అవును, అదే నా పేరు", అని జవాబిచ్చాడు.

వృద్ధశిల్పి అతనిని కౌగలించుకొని, "మునుపు నా ఆట బొమ్మలనన్నిటినీ నా నుండి దోపిడీ చేశావు. ఇప్పుడో నా హృదయం ఆడుకొనే బంగారు బొమ్మను నా నుండి దొంగిలిస్తు న్నావు !" అన్నాడు.

సుభద్ర, తాతయ్య మెడకు చేతులు పెనవేసి, "అవును తాతయ్యా, కాని ఒకటి విను : నాతోబాటే నిన్నుగూడా తీసికొని పోతున్నాడు" అని ఆయన చెవిలో వూదింది.

# గుర్రం

బ్రహ్మదేవుడు మహాప్రపంచాన్ని సృష్టి చేసే పని దాదాపు పూర్తికావచ్చింది. ఇంతలో ఆయనకు ఒక క్రొత్త ఆలోచన పుట్టింది.

తనకు సహాయం చేస్తున్నవారిని పిలిచి "మరికొంత ముడి సరుకు యిటు పట్టుకొనిరా; కొత్తరకపు జంతువును సృష్టి చేయాలి" అన్నాడు.

కాని అతను మోకరిల్లి, "అయ్యా, నా దొక మనవి చిత్తగించండి. సృష్టి చేసే ఉత్సాహం తమకు ఎక్కువయిన సమయాన ఏనుగులను, మొసళ్ళను, సింహాలను, కొండచిలువలను పుట్టించారు. కాని అప్పుడే వాటి తయారీకి ఎంత సరుకు ఖర్చుపడిందో తమరు గమనించనేలేదు. బరువూ, గట్టితనమూ వున్న ముడి సరుకు దాదాపు పూర్తిగా ఖర్చుఅయిపోయింది. కాని, తేలిక సరుకు కావలెనంటే చాలా వుంది" అని విన్నవించాడు.

బ్రహ్మ కొద్దిసేపు ఆలోచించి "సరే. వున్నదే పట్టుకునిరా", అని ఆజ్ఞాపించాడు.

ఈతూరి బ్రహ్మదేవుడు గట్టి సరుకు చాలా కొద్దిగా మెలకువగా వాడాడు. తాను తయారుచేసిన కొత్త జంతువుకు

కొమ్ములుకానీ. గోళ్ళుకానీ పెట్టలేదు. దానికి పలువరుసనైతే యివ్వక తప్పలేదు. ఆ పళ్లు నమలగలవేకాని కొరకలేవు. కొత్త జంతువుకు బ్రహ్మ యిచ్చిన శక్తివలన, అది యుద్ధరంగాలకు పనికి వొస్తుంది. కాని అది తనంత తాను యుద్ధాలకు తలపడదు. ఈ జంతువు పేరే గుర్రము,

గాలీ, ఆకాశమూ యే పదార్థాలతో తయారైనవో, అటువంటి పదార్థాలనే వాడి, బ్రహ్మదేవుడు గుర్రాన్ని తయారుచేశాడు. అందుచేత గుర్రం మనసు స్వేచ్ఛను, స్వాతంత్ర్యాన్నీ కోరుకొంటుంది. గాలితో పరుగు పందెం వేసికొంటుంది. ఆకాశం వంగి భూమిని తాకే చోటికి దౌడుతీస్తుంది. ఇతర జంతువులు ఏదో ఒక వుద్దేశ్యంతో పరుగెత్తితే, గుర్రం పరుగుకు ఏ వుద్దేశ్యమూ వుండదు. తననుండి తానే యెగిరిపోవలెనని కోరికయేమో దీనికి! అది పోట్లాడేది కాదు; మరొక చిన్ని జంతువును చంపి తినేదికాదు; దానికి ఒకే ఒక కోరిక: పరుగెత్తడం! గాలీ, ఆకాశమూ - వీటికి సంబంధించిన పదార్థాలు ఎవరిలో ఎక్కువ మెండై వుంటాయో. వాళ్ళు పరుగెత్త జూస్తారని తెలివిగల పెద్దలు అంటూ వుంటారు.

తాను సృష్టించిన జంతువునుచూచి, బ్రహ్మదేవుడికి సంతోషమయింది. తాను మునుపు సృష్టించిన జంతువులలో కొన్నిటికి నివాసభూములుగా కీకారణ్యాలను కల్పించాడు, మరి కొన్నిటికిగాను, కొండలలో గుహలు మలచి యిచ్చాడు. నిర్లక్ష్యంగా పరుగు తీస్తున్న గుర్రాన్ని చూచినప్పుడు, అంతుపొంతులు గానీ అడ్డంకులుకానీ లేని బహిరంగస్థలాన్ని దాని నివాసభూమిగా ఏర్పాటు చేశాడు.

ఆ బహిరంగ స్థలాన్ని దాటితే, మరి మానవుడు నివసించే స్థలం వుంది. తాను ప్రోగుచేసిన వస్తువుల బరువు వలన, మానవుడు వంగిపోయివున్నాడు. ఇంతలో అతడు గుర్రాన్ని చూచాడు. తాను మోస్తున్న భారాన్ని గుర్రపు వీపుమీద మోపగలను అనుకొన్నాడు. దాన్ని చెరపట్టగలను అనుకొన్నాడు.

ఒకానొకరోజున మానవుడు వలలను పన్నాడు. గుర్రాన్ని చెరపట్టాడు. దాని వీపున జీను వేశాడు. దానినోట కళ్ళెం పెట్టాడు. దానిని బందిఖానాలో నిర్బంధించాడు.

పెద్దపులి తన అరణ్యగృహంలోనూ, సింహం తన గుహలోనూ వుంటున్నవి. కాని ఎటువచ్చీ గుర్రమే తన గృహాన్ని పోగొట్టుకొంది. స్వేచ్ఛపట్ల దానకి ఎంతో కోరిక వున్నప్పటికీ, అది దాస్యాన్ని తప్పించుకొనలేకపోయింది.

బ్రతుకు భరింపరానిదిగా తయారుకాగా, చెరసాల గోడలను శివమెత్తినట్లు కాళ్ళతో తన్నింది. కాని యీ తాపులూ యీ తన్నులూ చెరసాలనేమీ బాధపెట్టలేకపోయినవి. తన డెక్కలే నొప్పివేసినవి. కాని ఎడతెరిపి లేని తన్నులవలన గోడల గచ్చు పెళ్ళలు పెళ్ళలుగా వీడివచ్చింది. దీనిని చూచి మానవుడు కోపగించాడు. "కృతఘ్నత అంటే యిదే! నేను కడుపుకు తిండి పెట్టుతున్నాను. దీని బాగోగులు విచారించేందుకు సేవకులను నియమించాను, కాని యీ మడ్డిపసరం నా దయను రవంతైనా గుర్తించలేదు" అనుకొన్నాడు.

గుర్రాన్ని మరపడానికి, దాని పొగరు అణచడానికి అతడు గట్టి చర్యలు తీసికొన్నాడు. అంతా అయిన తర్వాత, యింతకంటె తనకు నమ్మకమయిన జంతువు మరొకటి లేదు, అని చెప్పుకోగలిగాడు.

దానికి పదునైన గోళ్ళా, లేవు. కూచి కొమ్ములా, లేవు. కరుకైన పలువరుసా, లేదు. కాళ్ళనెత్తి తన్నుదామా అంటే కొరడా ఝుళిపిస్తారు. ఇక మిగిలిన దేమిటి? ఒకే ఒకటి సకిలింత.

ఒకరోజున బ్రహ్మదేవుడికి, బాధతో నిండిన గుర్రపు సకిలింత వినవచ్చింది. ధ్యానమందు మునిగివున్నవాడల్లా ఒక్క పెట్టున మేలుకొన్నాడు, భూమిపై గల బహిరంగస్థలాలను వంగి చూచాడు. గుర్రం అక్కడ వుంటేగదూ?

యమధర్మరాజును పిలిపించాడు. యముడంటే చావు. పిలిపించి, "ఇది నిజంగా నీ పనే. సందేహం లేదు. నా గుర్రాన్ని దొంగిలించేశావు", అని నిందించాడు.

యముడి కేమీ తెలియదు. "లోకపితా, నన్నెప్పుడూ తమరు నమ్మలేదు. నేనంటే మీ కెప్పుడూ అనుమానమే. తమ దృష్టిలో నేను పాపాల భైరవుణ్ణి. కాని ఒక్కసారి మానవుడి యింటి మీదికి తమ చూపు తిప్పండి", అని చేతులు కట్టుకొని చెప్పాడు.

బ్రహ్మదేవుడు మళ్ళీ క్రిందికి చూచాడు. గోడల నడుమ యిరుకు జాగాలో నిలచి, సత్తువ వుడిగి, బాధతో సకిలిస్తున్న గుర్రం కనిపించింది.

ఆయన గుండె నీరైపోయింది. మానవుని పిలచి, "ఈ గుర్రాన్ని స్వేచ్ఛగా విడిచివేయకుంటే, పెద్దపులికి మోస్తరే దీనికి కోరపళ్ళూ కూచిగోళ్ళూ కల్పిస్తాను చూచుకో," అని బెదిరించాడు.

మానవుడు మోసగాడు. "లోకపితా, మీరు సృష్టించిన యీ జంతువు స్వేచ్ఛకు తగదు. చూడండి, దీనికొరకని ఎంత అందమైన సాల కట్టించానో," అని చెప్పాడు.

కాని బ్రహ్మదేవుడు గుర్రాన్ని స్వేచ్ఛగా వదలివేయాలని పట్టుబట్టాడు.

"తమ వుత్తర్వును అక్షరాలా పాటిస్తాను. కాని ఒకవారం రోజులలో తమరు మనసు మార్చుకోవలసివస్తుంది. నేను దీనికై కట్టిన సాలయే ఉత్తమ నివాసస్థలమని ఒప్పుకొంటారు చూడండి," అన్నాడు మానవుడు.

అని, పోయాడు. పోయి ఏంచేశాడు ? గుర్రపు ముంగాళ్ళకు బంధంవేసి, వదలిపెట్టాడు. కాబట్టి గుర్రం గోదురుకప్ప వలె దుమికి పడసాగింది.

సత్యలోకంనుండి బ్రహ్మకు గుర్రమే కనుపించింది. కాని దాని ముంగాలి బంధం కనుపించలేదు, అవమానంతో ఆయన ముఖం ఎర్రబారింది. ఇదా. చివరకు తాను సృష్టించిన జంతువు ! ఛీ, ఛీ ! ఇంతటి గొప్ప పొరబాటు తానెన్నడూ చేయలేదను కొన్నాడు.

మానవుడు వచ్చాడు. "ఏమిచేయమంటారు దీనిని ? మీ లోకంలో బహిరంగ స్థలాలులేవా ? ఉంటే, దీనిని అక్కడికి తోలిస్తాను", అన్నాడు.

"చాలు చాలు ! ఇక యీ వికారపు జంతువును చూడలేను. తిరిగి దీనిని తీసికొనిపోయి, నీ సాలలోనే వుంచుకో", అన్నాడు బ్రహ్మ. "కాని, లోకపితా, దీనిని పోషించడమంటే సులువా ? దీని భారం నామీద ఎందుకు మోపుతారు ? కనికరించండి నన్ను" అని దొంగ విన్నపం చేశాడు.

"తప్పదు. దీని బరువు నీమీద వేసికోవాలి. అప్పుడే నీ గొప్పతనం ఉదారబుద్ధీ లోకానికి వెల్లడి అవుతుంది", అని ఒప్పించాడు బ్రహ్మ.

# విజయ ఫలం

యుద్ధరంగమునుండి చెడు కబురు వచ్చింది. రాజు మనస్సు కలవరపడింది. తోటలో పచారు చేయసాగాడు.

తోట గోడవద్ద, చెట్టునీడలో, ఒక పిల్లా, ఒక పిల్లవాడూ ఆడుకొంటున్నారు. రాజు వారివద్దకు పోయాడు.

"మీరు ఆడుతున్న ఆట పేరు యేమిటి?", అని రాజు వారిని అడిగాడు.

"సీతా, రాముల అరణ్యవాసం అభినయిస్తున్నాము". అన్నారు. రాజు కూర్చున్నాడు. ఆటను జాగ్రత్తగా ఆసక్తితో చూడసాగాడు. "చూచావుకదా దండక మహారణ్యాన్ని ? మన పర్ణశాల యిక్కడనే వేసికొందాము", అన్నాడు రామపాత్రధారి యైన పసివాడు.

ఎండు గడ్డిపోచలనూ, రాలిన ఆకులనూ ప్రోగుచేశాడు. క్షణమైనా తీరుబడి వున్నట్టులేదు.

ఆ పసిపిల్ల ఆకు అలములనూ, చెట్లవేళ్ళనూ వండుతున్నది. కాని మంటలేదు. అంటే స్వదేశం వదలి వచ్చిన భర్తయైన రామునికొరకు సీతాదేవి వంటపని చేస్తున్నది. చేయి ఆడనంత పని.

"అంతా సక్రమంగానే వుంది. కాని రాముడు రాక్షసునితో పోరాడాలి కదా? ఆ రాక్షసు డేడీ, లేడే?", అని అడిగాడు రాజు. తాను ఆ విషయమే మరచిపోయానన్నాడు ఆ పసివాడు.

"మరేమీ ఫరవాలేదు, నేనే రాక్షసుడుగా వుంటాను," అన్నాడు రాజు. పసివాడికి వుత్సాహం రేకొన్నది. రాజుగారిని తదేకంగా చూచి. "అయితే, నాచేత మీరు ఓటమి ఒప్పుకోవాలి." అన్నాడు.

"ఓ? దానికేమి? ఓటమిని ఒప్పుకొనేందుకు నేను ఎప్పుడూ తయారు, నువ్వే చూస్తావుగా? చెప్పడమెందుకు," అన్నాడు రాజు.

ఆరోజున రాక్షసవధ నిర్విఘ్నంగా సాఫీగా కొనసాగి పోయింది. తన సంతోషంలో, ఆగంలో, ఆ పసివాడు రాజును పోనీయనేలేదు. ఒక్కగంట వ్యవధిలో రాజు, పదిమంది రాక్షసుల చావు చావవలసివచ్చింది.

సీతా, రాములు జీవించి, ప్రేమించుకొన్న యుగాలలో తాము ఎట్లా పాడినవో, పక్షులు యిప్పుడు కూడా అవే పాటలు పాడినయి. పురాతనకాలమందు ఎట్లాగో, యిప్పుడు కూడ సూర్య రశ్మి చెట్ల ఆకులమీద పడుతున్నది.

రాజుగారి మనస్సు శాంతించింది. తన మంత్రిని పిలిపించి. "ఈ పిల్లలు ఎవరి బిడ్డలో మీరు ఎరుగుదురా?," అని అడిగాడు,

"ఈ పిల్ల నా బిడ్డే. పేరు రుచిర. ఈ పిల్లవాడి తండ్రి దేవాలయ పూజారి. చాల బీదవాడు. ఇతని పేరు కౌశికుడు," అని మంత్రి విన్నవించాడు.

"ఈ పిల్లలిద్దరూ పెరిగి పెద్దవారైనప్పుడు, భార్యాభర్తలు కావాలి. ఇది నా ఆజ్ఞ" అన్నాడు రాజు.

మంత్రికి యిది నచ్చలేదు. కాని ప్రభువుగారికి యెదురు పలికే ధైర్యంలేదు. కాబట్టి వూరకే తలవంచుకొన్నాడు.

రాజుగారు కౌశికుని ఉత్తమ పాఠశాలకు పంపాడు. దొడ్డ వంశాలలో పుట్టిన బాల, బాలికలు యిక్కడ చదివేవారు. వారిలో రుచిరకూడ వున్నది. కౌశికునివంటి పేద విద్యార్థినిచూచి పంతులు గారు లోలోపల చీదరించుకొనేవాడు కూడా. చదువుకొనె విద్యార్థులుకూడ కౌశికుని వెలిగా చూచేవారు. కాని రాజశాసనాన్ని దాట వీలులేదు కదా!

రుచిరకు ఎటూ తోచలేదు. బాల, బాలికలు కలిసి ప్రేలెత్తి తననూ, కౌశికునీ చూపించి, ఒకరితో ఒకరు గుసగుసలు పోయే వారు. అప్పుడు రుచిర చెక్కిళ్ళు మండిపోయేవి; రుచిర కళ్ళలో కోపపు కన్నీళ్లు నిండేవి.

తాను పడవేసికొన్న పుస్తకాన్ని, కౌశికుడు వంగి పైకెత్తి యిస్తే, రుచిర నమస్కరించనైనా నమస్కరించేది కాదు. కౌశికుడు తనను పలుకరిస్తే, తాను బదులుకూడ పలికేదికాదు.

రుచిరపట్ల పంతులుగారి వాత్సల్యానికి అంతుపొంతులేదు. ఆమె చదువు విషయమై పంతులుగారి శ్రద్ధకు అంతుపొంతులేదు. చదువులో ప్రతి శాఖలోనూ, కౌశికునికంటె రుచిర ముందు వుండాలని, పంతులుగారు పట్టుబట్టి బోధించేవాడు. రుచిరకుకూడ అదే పట్టు.

కౌశికుని వెనుకవేసి, రుచిర ముందుకు పోగలదని అని పించేది. ఏమంటే, కౌశికుడు పుస్తకాలకు అంటిపెట్టుకొని వుండే వాడు కాదు.

పాటలు పాడడమంటేనూ, ఈదడమంటేనూ, అడవులలో తిరగడ మంటేనూ కౌశికుడు చెవికోసుకొనేవాడు.

ఇది చూచి పంతులుగారు కౌశికునిమీద కోపపడి, "మరింత శ్రద్ధతో పుస్తకాలు చదువవేమి ?." అని అడిగేవాడు.

"నాకు పుస్తకాలమీద ఎంత ఆసక్తివుందో, యితర విషయాలమీదకూడ అంత యిష్టం", అని కౌశికుడు జవాబిచ్చేవాడు.

"అనవసరమైనవాటిని అన్నిటినీ విడిచిపెట్టాలి". అని గురువుగారు సలహా యిచ్చారు.

"అట్లయితే, పుస్తకాలమీద నాకు గల ఆసక్తికూడ తొలగిపోతుంది". అన్నాడు కౌశికుడు.

కొన్నిరోజుల తర్వాత, రాజుగారు గురువును పిలిపించి, "మీ విద్యార్థులలో వుత్తమోత్తము లెవరు ?", అని అడిగాడు.

"రుచిర", అని గురువు జవాబిచ్చాడు.

"కౌశికుడో ?". అని అడిగారు రాజుగారు.

"పాఠశాలవలన అతను సాధించింది తక్కువ", అన్నాడు గురువు.

"కౌశికుడు, రుచిర భార్యాభర్తలు కావలెనని నా కోరిక." అన్నాడు రాజు.

గురువుగారు నవ్విన నవ్వులో కొంత వెక్కిరింపు వుంది.

"ఉదయకాంతికీ, సంజె చీకటికీ పెళ్ళి జరిగితే ఎట్లుంటుందో, రుచిరా, కౌశికుల పెళ్లి అట్లుంటుంది", అన్నాడు గురువు.

రాజుగారు తమ మంత్రిని పిలువనంపి, "కౌశికునితో మీ కుమార్తె పెళ్ళిని ఆలస్యం చేయ వీలులేదు". అన్నారు.

"ప్రభూ! నా కుమార్తెకు యీ పెళ్ళి యిష్టంలేదు", అన్నాడు మంత్రి.

"తన మనసులోని అసలు కోరికను ఆడది ఎప్పుడైనా వెల్లడి చేస్తుందా, మంత్రీ?". అన్నాడు రాజు.

"కాని రుచిర కార్చే కన్నీళ్ల సాక్ష్యం", అన్నాడు మంత్రి.

"కౌశికుడు తనకు భర్తగా తగడని ఆమె అనుకొంటున్నదా?", అని రాజు ప్రశ్నించాడు.

"అవును. మీరన్నది నిజం", అన్నాడు మంత్రి.

"అయితే సరే! కాని నా యెదుట వారు చర్చించుకోవాలి. ఆ వాద, ప్రతివాదాలలో కౌశికుడు ఓడిపోతేనేగాని, యీ పెళ్ళి ఆగదు", అని ఆజ్ఞాపించాడు రాజు.

కొలువుతీరి కూర్చున్నాడు రాజు. కౌశికుడు ఆయన పాదాల వద్ద కూర్చున్నాడు.

మంత్రి కుమార్తెను వెంటబెట్టుకొని, గురువుగారు వచ్చారు. కౌశికుడు పైకిలేచి, వచ్చిన వారిద్దరికీ నమస్కరించాడు. రుచిర అతనివైపే చూడలేదు.

మునుపు యెన్నడూ వాళ్ళు ఒకరితో నొకరు వాద, ప్రతివాదాలు చేయలేదు. కౌశికుడంటే సరిపడని యితర విద్యార్థులు అతనిని చర్చలలో పాల్గొన నీయలేదు. కాని ఆ రోజున అతని వాదాలపై వెక్కిరింపు తళతళమని ప్రసరిస్తుంటే, వుక్కు కత్తి మీద వెలుతురు పడినట్లుగా వుండింది. ఇది చూచి, గురువుగారు ఆశ్చర్యపడినారు, లోలోపల సంకటపడినారు. అందమైన రుచిర నొసట, చెమట గుబగుబపోయసాగింది. తలలో గజిబిజి వ్యాపిం

చింది. వాదించి వాదించి, రుచిరను ఓటమి అంచువరకు నెట్టిన తర్వాతనే, కౌశికుడు ఆమెను పాపమని వదలిపెట్టాడు.

గురువుగారి కంఠం కోపంతో కంపించిపోయింది. రుచిర కళ్లు నీళ్ళతో నిండినవి.

రాజుగారు మంత్రివైపు తిరిగి, "మరి, యిక పెళ్ళి ప్రయత్నాలు చేయించండి", అన్నాడు.

కాని కౌశికుడు చేతులు మోడ్చి నమస్కరించి. "ప్రభూ! క్షమించండి. ఈ పెళ్ళి నాకు యిష్టంలేదు", అని విన్నవించాడు. రాజుగారికి ఆశ్చర్యం కలిగింది.

"విజయఫలాన్ని చేబట్టవూ? వింతగావుందే!", అన్నాడు రాజు.

"గెలుపు నాదే. కాని విజయఫలాన్ని మరొకరు తీసికోవచ్చు". నన్నాడు కౌశికుడు.

ఇంతలో గురువుగారు కలుగజేసికొని, "ప్రభూ! ఒక సంవత్సరం గడువుపెట్టండి. గడువు చివరి రోజున మరొక చర్చ ఏర్పాటుచేయండి"- అని సలహా యిచ్చాడు.

ఆ సూచనను రాజుగారు ఆమోదించారు.

కౌశికుడు పాఠశాల విడిచిపెట్టాడు. ఒక్కొక్కప్పుడు అడవులలో, వేరొకప్పుడు కొండలపై ప్రత్యక్షం కాసాగాడు. గురువుగారు తన సర్వశక్తులను ధారపోసి రుచిరను తయారుచేయసాగారు. కాని ఆమె మునుపటి రుచిర కాదు. ఏమి అయింది ఆమెకు? ఆమె మనసు ఎక్కడెక్కడ తిరుగాడుతున్నది?

గురువుగారికి కోపంవచ్చింది. "గడువు పూర్తి అయ్యే లోపల నీవు జాగ్రతపడకుంటే. తిరిగి అవమానం పాలవుతావు". అని హెచ్చరించాడు.

కాని రుచిర కోరుకొంటున్నదే అది. అంతకంటె ఆమెకు కావలసినది వేరేమీ లేదు. పుస్తకాలు ముట్టుకోనని పట్టుబట్టి నట్లున్నది.

గురువుగారి కోపానికి హద్దులేకపోయింది. "ఋషుల సాక్షిగా. శపథం చేస్తున్నాను: మరెప్పుడూ ఆడవారికి చదువు చెప్పను. వేదవేదాంత రహస్యాల నన్నిటినీ బోధపరచుకొన్నాను. కాని ఆడదాని మనసు మర్మాలు నాకు బోధపడలేదు", అనుకొన్నాడు.

ఒకరోజున మంత్రి. రాజుగారివద్దకు వచ్చి, "ప్రభూ! నా కుమార్తెకు భవదత్తుని వంశంనుండి మంచి సంబంధం వచ్చింది. కులంలోనూ, గుణంలో, సంపదలోనూ, కీర్తిలో ఆ వంశానికి సరిరాగల వంశాలు చాలాలేవు. తమ సెలవైతే పెళ్ళి చేస్తాను", అన్నాడు.

"మీ అమ్మాయి యేమంటున్నది?", అని అడిగినాడు రాజు.

"తన మనసులోని అసలు కోరికను ఆడది ఎప్పుడైనా వెల్లడి చేస్తుందా, ప్రభూ!", అన్నాడు మంత్రి.

"కాని, ఆమె కార్చే కన్నీళ్లు - అవి నేడు సాక్ష్యాలు గావా?". అని రాజు ప్రశ్నించినాడు.

మంత్రి జవాబు ఇవ్వలేకపోయాడు.

తోటలో కూర్చుని, రాజుగారు రుచిరను పిలిపించాడు. రుచిర వచ్చింది.

"రాముని వనవాస నాటకం జ్ఞాపకమున్నదా, నీకు రుచిరా ?", అని రాజు ప్రశ్నించాడు.

సిగ్గుపడి చిరునవ్వుతో, ముఖం మరొకవైపుకు త్రిప్పుకొంది రుచిర.

"ఈవేళ మళ్ళీ ఆ ఆటను చూడవలెనని వుంది", అన్నాడు రాజు. రుచిర తన ముఖానికి కొంత మేలిముసుగు కప్పుకొని, మాటలాడకుండా వుంది.

"కావలసిన అడవి వుంది. రాముడూ, వున్నాడు. కాని సీత లోపించింది. నీకు యిష్టమయితే, రుచిరా, ఆ లోటును పూరించ గలవు", అన్నాడు రాజు.

రుచిర, దగ్గరకు వచ్చి, వంగి, రాజుగారి పాదాలకు ప్రణమిల్లింది.

"బంగారు కొండవు, రుచిరా ! కాని ఈ తూరి రాక్షసుడి పాత్రను నేను ధరించను సుమా !", అంటూ రాజుగారు నవ్వారు.

రుచిర తన కళ్ళను పైకెత్తింది. అవి ప్రేమతో నల్లబారి తళతళలాడుతున్నాయి.

"ఈతూరి, మీ గురువుగారు రాక్షసుని వేషం వేస్తారు, సరేనా ?" అంటూ రాజుగారు మరొకసారి నవ్వారు.

# పెళ్ళి

సందె చీకటి పడింది. పెళ్ళికొడుకు వచ్చాడు. పిడుగుల ఆర్భాటము, ఎడతెరిపిలేక వానచినుకులు పడేచప్పుడు - వీటిని మించి శంఖాల మ్రోత !

చావిడిలోని దీపాలకాంతి బంగారు నగలమీదపడి మిలమిల లాడుతున్నది. ఉల్లాసముతోటి, నవ్వులతోటి ముఖాలు ప్రకాశిస్తున్నవి. వధూవరుల మంగళ వస్త్రాల కొనలను బ్రహ్మముడి కట్టారు. ఇది వారి కలయికకు గుర్తు.

ఇంతలో కొమ్ము వూదిన చప్పుడు వినవచ్చింది. అది ముప్పును సూచిస్తున్నది. ఒక యోధుడు గబగబలోనికి వచ్చాడు. పురుషులు కలవరపడి పైకి లేచారు. గ్రుక్క తిప్పుకొనకుండా. ఆ యోధుడు. "రాజధానిమీదికి పితూరీదారులు వచ్చిపడ్డారు. రాణా రామసింహుడు యుద్ధరంగానికి బయలుదేరిపోయాడు. ఆయన మీ అందరి తోడ్పాటును కోరుతున్నాడు. రండి, పౌరుషమే ధనముగా గలిగిన రాజపుత్రులారా, రండి !", అని అరచి చెప్పాడు.

"మార్వాడదేశప్రభువు రాణారామసింహునికి జయమగు గాక-" అని యోధుడు పిడుగు పడినట్లు గర్జించాడు.

"మార్వాడదేశప్రభువు రాణారామసింహానికి జయమగు గాక." అని రాజకుమారుడు. పిడుగుపడినట్లు గర్జించాడు. పెండ్లికుమార్తె గుండె కంపించిపోయింది. ఆమె కళ్ళలో దుఃఖ బాష్పాలు నిండాయి.

"రండి- గౌరవమే బ్రతుకుగా గలిగిన రాజపుత్రులారా, రండి! మైత్రిరాజకుమారా, రావయ్యా, ఆలస్యము చేయకు, సమయము మించిపోతున్నది," అని ఆ యోధుడు త్వరపెట్టసాగాడు.

శంఖధ్వని అణగారిపోయింది. పెళ్ళికొడుకు బ్రహ్మముడి విప్పాడు. తన వధువును తదేకముగా తేరిపారజూచి, "సెలవు, రాజకుమారీ, సెలవు. అదిగో యుద్ధమూ, చావూ నన్ను పిలుస్తున్నాయి. శెలవు," అని చెప్పాడు.

మంగళ వస్త్రాలతోనే, మైత్రి రాజకుమారుడు. ఒక్క వుదుటున, గుర్రము మీదికి ఎగిరి ఎక్కాడు. దానిని వాయువేగ. మనోవేగములతో పరుగెత్తించాడు. వేయి దివ్వెలూ ఆరిపోయినవి. మెడలోనిమాలతో. తలమీది వివాహకిరీటములో, రాజకుమారుడు యుద్ధమాడబోయాడు.

పెళ్ళికుమార్తె తల్లి కనుల నీరు క్రుక్కుకొన్నది. కుమార్తె వైపు తిరిగి, "నీ మంగళ వస్త్రాలను తీసివేయి తల్లీ, నీవు దౌర్భాగ్యురాలవు." అని చెప్పింది.

కాని వధువు, తల్లితో, "అవి తీయను, నా భర్తను కలిసికొనేందుకు మైత్రిదేశపు రాజధానికి పోతాను." అని బదులు చెప్పింది.

ఎంతో విలాసముతో, వైభవముతో ఆమె యెక్కిన పల్లకీ ముందుకు పోసాగింది. దారిలో బ్రాహ్మణులు ఆమెను ఆశీర్వదించారు. చివరకు మైత్రీ రాజమందిర ద్వారాలను సమీపించింది. కాని చీకటిలో ఎవరో గొంతెత్తి, "ఎవరక్కడ ? ఆ సంగీతాన్ని ఆపివేయండి. మైత్రీరాజకుమారుడు యుద్ధమందు చనిపోయాడు. అతని శవాన్ని దహనం చేయడానికి వచ్చాము మేము." అన్నారు.

వధువు పల్లకీ దిగి వచ్చింది. "కొమ్ములు వూదండి. పిల్లనగ్రోవులు వూదండి. పెండ్లి పూర్తికావాలి. బ్రహ్మముడి తిరిగివేయాలి," అన్నది.

మైత్రీరాజకుమారుడు మంగళ వస్త్రాలతోటే, చితిమీద పవ్వళించి వున్నాడు. ఆమె తనవరుని సమీపించింది అతని మంగళ వస్త్రపు కొనకు తన వస్త్రపు కొనను బ్రహ్మముడి వేసింది. అతని తలను ఒడిలో చేర్చుకొన్నది. చల్లబారిన అతని ముఖాన్ని ముద్దాడింది;

"భగవంతుడు నిన్ను అనుగ్రహించుగాక! తల్లీ, నీవు చావునే జయించావు," అని బ్రాహ్మణులు గంభీరంగా ఆశీర్వదించారు.

చితిమంట నాల్కలు చాచింది. పెళ్లి సమాప్తమయింది.

# పద్మపూజ

క్రూరమైన మంచు తాకిడికి పద్మాలు చాల మట్టుకు చని పోయినయి. ఒకే ఒక్కటి కొలనులో ప్రాణాలతో మిగిలివుంది. ఆ కొలను సుదాసునిది. సుదాసు తోటమాలి.

ఈ పద్మమును తీసికొని, సుదాసు దాని నమ్మటకు రాజ మందిరానికి బయలుదేరాడు. రాజమందిర ద్వారమువద్ద అతనికి ఒక వ్యాపారి ఎదురయ్యాడు. ఆ వ్యాపారి ధనికుడు. అతడు పుష్ప మును ఎంతో మెచ్చుకొన్నాడు.

"ఈ పువ్వును నేను కొని. బుద్ధునికి అర్పిస్తాను. బుద్ధ భగ వానుడు విచ్చేసి వున్నాడు. దీని ఖరీదు ఎంతో చెప్పు," అని వనమాలిని అడిగాడు,

ఒక బంగరు రూకకు సుదాసు దానిని యిస్తానన్నాడు,

ఆ వ్యాపారి, జేబులో చేయిపెట్టి రూకకొరకు తడుము కొంటూ వుండగా. యింతలో రాజుగారు మందిరమునుండి వచ్చాడు. ఆయన బుద్ధభగవానుని దర్శనానికి బయలుదేరాడు. సుదాసుని చేతనున్న తెల్లని పువ్వునుచూచి, "భగవానుని కొరకు నేను దీనిని కొంటాను. ఖరీదెంత ?", అని అడిగాడు.

"ఈవరకే దీనిని వీరికి ఒక బంగరు రూకకు అమ్మి వేశాను, ప్రభూ!," అన్నాడు సుదాసు.

"నేను పది బంగరు రూకలిస్తాను గాని. దీనిని నాకు అమ్ము." అన్నాడు రాజు.

"నేను ఇరవై రూకలిస్తాను." అన్నాడు వ్యాపారి.

ఈ తీరున ఆ పువ్వుకొరకు వారు ఒకరితో నొకరు పోటీ పడ్డారు. దాని ధర పెరిగిపోయింది.

వనమాలి దీనినంతా విన్నాడు. విని, తనలో "భగవానుని కోసమె కదా, వీరు యింత పెచ్చు ధర చెల్లిస్తానంటున్నారు. నేనే పోయి దీనిని బుద్ధభగవానునికి అర్పిస్తే, మరెంత లాభం సంపాదించగలనో," అనుకొన్నాడు.

"నన్ను క్షమించండి. నే నీపువ్వును మీకు ఎవ్వరికీ అమ్మ దలుచుకోలేదు." అని చేతులు ముకుళించి ప్రార్థనాపూర్వకంగా సుదాసు చెప్పాడు. వెంటనే ఊపిరిసలుపనంత వేగాన పరుగుదీసి, బుద్ధుడు కూర్చొనియున్నచోటు చేరాడు. ఆయన ఎంతో నిశ్చలముగానూ, దివ్యశోభతోనూ కూర్చుని ఉన్నాడు.

సుదాసు బుద్ధునిచూశాడు. కాని కదలికలేనట్లు వున్న చోటనే నిలుచున్నాడు. కొంతసేపటివరకు అతడు మాటలాడ లేకపోయాడు. చిట్టచివరకు భగవానుని పాదములకు సాష్టాంగపడి పువ్వును అర్పించాడు.

బుద్ధభగవానుని ముఖము చిరునవ్వుతో విప్పారించి. "ఏమి నీ కోరిక?", అని సుదాసును ప్రశ్నించాడు,

"తమ పాదధూళిలో ఒక అణువు యిచ్చిన మరేమీ అక్కరలేదు," అని ఆ వనమాలి ప్రార్థించాడు.

# మోక్షము

ప్రియుని యెడబాటుచేత, కృశించి నీరసించిన ప్రణయిని పూలపట్టు ప్రక్కన కూర్చుని వుంది. ఆ పూలపట్టుకూడ ఆమెకు నిప్పులపాన్పువలె అనిపించింది. కూర్చుని. పోయిన ప్రియుని ప్రతిమను చేయసాగింది. తనకు గుర్తు వున్న పోలికలతో ముక్కలతో ఆ ప్రతిమను కొంచెంకొంచెం తీర్చి దిద్దసాగింది. కొంతసేపు దానివైపు కళ్ళు అప్పగించి చూస్తుంది. కొంతసేపు గడచిపోయిన రోజులను గుర్తుకు తెచ్చుకొంటుంది. కళ్ళలో నీళ్ళు క్రమ్ముతాయి.

కాని, దినాలు గడిచేకొద్దికీ, ఆమె మనసులోని చిత్రపటం మీద ఏదో నీడ వ్యాపిస్తూవుంది. మొదటిలో విస్పష్టమై వుండిన చిత్రం యిప్పుడు మాసి, చెదరి పోతుంది. రాత్రిపూట పద్మం ముకుళించుకొని పోయేటట్లు, ఆమె జ్ఞాపకాలు ఒకటొకటిగా ముడుచుకొని పోతున్నాయి.

ఆమెకు తనమీద తనకే కోపంరాసాగింది. అవమానపడ సాగింది. తనను తానే బాధపెట్టుకొని ఆనందించ సాగింది. పళ్ళు తిని, నీరుత్రాగి, కటికనేలమీద పవళించి, కష్టపెట్టుకొన సాగింది. తానుచేస్తూవచ్చిన ప్రతిమ పూర్తికావచ్చింది, కాని తన మనసులో గల చిత్రానికీ, తానుచేసిన యీ ప్రతిమకూ పోలికలు అసలేలేవు.

ఈ ప్రతిమను పోలిన మనిషి భూమిమీద ఎవరూలేరు. కాని ఆమె తనను తాను మోసగించుకొంటూ, పోయిన తన ప్రియుని రూపమే అచ్చంగా యీ ప్రతిమలో కనుపిస్తున్నది, అనుకొంది.

పద్మాలను సేకరించి, ప్రతిమను పూజిస్తుంది: దాని చుట్టూ బంగరు దివ్వెలను అమర్చుతుంది. వాటిలో కమ్మటివాసన గల తైలాలను పోసి నింపుతుంది. పూవులూ, అగరుఒత్తులూ పోగుపడి, ప్రతిమను కంటికి కనుపడకుండా చేయసాగినాయి.

ఒకనాడు పసివాడొకడు ఆమె వద్దకు వచ్చి, "ఇక్కడ ఆడుకోనిస్తారా ?" అని అడిగాడు.

"ఎక్కడ ?" అని అడిగింది ఆమె.

"ఈ బొమ్మదగ్గర" అని పసివాడు జవాబిచ్చాడు.

"దీనిదగ్గరకు ఎవ్వరినీ రానీయను", అని కఠినంగా చెప్పిందామె.

మరొక కుర్రవాడువచ్చి, "మీపూవులు కొన్ని గిల్లుకొనవచ్చునా ?," అని అడిగాడు.

"ఏ పూవులు ? ", అని ప్రశ్నించింది ఆమె.

"ఆ బొమ్మచుట్టూ పూస్తున్న సంపెంగ పూవులు," అని జవాబిచ్చాడు ఆ కుర్రవాడు.

"ఆ పువ్వులు ఎవరూ ముట్టకోవడానికి వీలులేదు," అని కఠినంగా శాసించింది ఆమె.

ఇంకొక బుడుతడువచ్చి, "ఆ దివ్వెతీసికొని వచ్చి, మాకు చీకటిలో దారిచూపించరూ ?," అని బ్రతిమాలాడు. "ఉన్నచోట నుంచి దివ్వెను తొలగించ వీలులేదు" అని కఠినంగా ఆ బుడుతణ్ణి పంపించి వేసిందామె.

పిల్లలు గుమిగూడి కేరింతాలు కొడుతూ, గంతులు వేస్తూ, వస్తూ పోతున్నారు. ఒక జట్టుపోతే వేరొకజట్టు వస్తున్నది. ఒక్క క్షణకాలం ఆమె ఆలోచనలోపడి తేలిపోతుంది. కాని ఇంతలో తిరిగి మొదటికివచ్చి, మెలకువపడి, అవమానానికి ఎర్రబారుతుంది.

దాపుననే వున్న బస్తీలో పెద్దసంత ఒకటి మొదలయింది.

వృద్ధుడు ఒకడు ఆమెనుచూచి, "సంతచూడ్డానికి పోదాం, వస్తావా ?", అని అడిగాడు.

"నేనా ? రాలేను," అని ఆమె జవాబిచ్చింది.

కుర్రపడుచు ఒకతె ఆమెనుచూచి. "ఊఁ. కానియ్. సంతకు పోదాం. బయలుదేరు." అని త్వరపెట్టింది

"నేనా ? తీరికలేదు," అని ఆమె జవాబిచ్చింది.

చిన్నారి చిట్టిబాబు ఒకడు. ఆమె చీరచెరగుపట్టుకొని, "నన్ను సంతకు తీసుకోపోవూ ?" అని ముద్దుగా అడిగాడు.

కాని తన మనసులోని కోరికను గురించి ఒక్కక్షణమైనా ధ్యానించకుండా వుండలేదామె.

ఒకానొక రాత్రిపూట. ఎక్కడోగాని దూరంలో, సముద్రపు తరంగాలు హోరుపెడుతున్నట్లుగా, ఏదో సవ్వడి వినిపించింది. యాత్రికులు సంతకు పోతున్నారు. ఒకరు కాదు, యిద్దరుకాదు, వందమందికాదు, వేల సంఖ్యలో వున్నారు. ఈ వూరిగుండానే పోతున్నారు. కొందరు మూటలు మోసికొని, కొందరు వుత్త చేతులతో పోతున్నారు.

ఆమెకు మెలకువ వచ్చింది. యాత్రికుల అడుగుల చప్పుడులో పిట్టలపాటలు సద్దుమణగి పోయాయి. సంతకు పోవలె

నని ఆమెకు కోరికపుట్టింది. కాని తాను పోజాలనని గుర్తుకు తెచ్చుకొంది. తనదేవుని పూజించని రోజు ఒక్కటికూడా వుండకూడదు. ఆ దేవుడు ఎవరోకాదు - పోయిన తన ప్రియుని ప్రతిమయే. వెంటనే హడావుడిగాలేచి, గబగబ తోటలోకి పోయింది. కాని ఏదీ తన ప్రతిమ ? ఏడీ తన దేవుడు ? తన ప్రియుడు ఏమయ్యాడు ?

తన తోటలో యాత్రికులు మూకలు మూకలుగా పోతున్నారు. పూలపట్టు కనుపించలేదు. ప్రతిమ పోయింది. త్వర త్వరగా పోతున్న స్త్రీ పురుషుల ప్రవాహం క్షణమైనా ఆగదు.

"ఏడీ నా ప్రియుడు ?" అని తనను తానే ప్రశ్నించుకొంది ఆమె.

"అడుగో, అడుగో; నడచిపోతున్నవారిలో వున్నాడు." అని ఏదో అశరీరవాణి ఆమె చెవిలో వూదింది.

ఇంతలో ఒక చిన్నారి చిట్టిపాపవచ్చి, "నన్ను తీసికొనిపోవూ సంతకు ? పోదాంరావూ ?", అని ముద్దుముద్దుగా అడిగింది.

"అట్లాగే పోదాం, పద !", అని జవాబిచ్చింది ఆమె.

పూలపట్టునుదాటి, యాత్రికులలో కలిసింది. ఎందుచేత ? బ్రతికివున్నవారిలో, ఆమెకు పోయినదేదో అది అగుపించింది.

# తల ఖరీదు

కోసలదేశ ప్రభువు ధర్మాత్ముడు, దీనులపాలిటి కల్ప వృక్షము, అని పేరు మోశాడు.

అతని కీర్తిని చూచి, కాశీదేశ ప్రభువు అసూయపడ్డాడు. "నా దేశపు ప్రజలుకూడ, నాకంటె అతడే ఘనుడని అనుకొంటు న్నారు. దాన ధర్మాలనే కపటనాటకమాడి, నా ప్రజల హృదయా లను వశపరచు కొన్నాడు. ఎంత సాహసము! సైనికులారా, చూస్తారేం? కదలండి యుద్ధానికి! ఎవరు నిజంగా ఘనులో, ఖడ్గము తీర్పు చెప్పగలదు" అన్నాడు.

యుద్ధం వచ్చింది, పోయింది. కోసలదేశ ప్రభువు ఓడి పోయాడు. ప్రాణాలు చేతబట్టుకొని, అడవులకు పారిపోయాడు. "ఆయుధ బలం ఎవరికి ఎక్కువో, వారే దాన ధర్మాలు చేసేం దుకు తగినవారు," అన్నాడు గెలిచిన కాశీదేశ ప్రభువు. కాని దేశం, జనం దిగులుతో కుమిలిపోయింది. లోక ప్రళయం దాపుకు వచ్చింది, పరమేశ్వరుడు న్యాయంతప్పి నడుస్తున్నాడు, సాధు జనులు బాధల పాలవుతున్నారు అని ప్రజలు అనుకొన సాగారు.

కాశీదేశ ప్రభువుకు పిచ్చికోపం వచ్చింది. "వీళ్ళందరూ ఆ పోయినవాడికోసం విలపిస్తారెందుకు? నేనంటే వీళ్ళకు

లెక్కే లేదా ? ఇది అంతా కుట్రలో భాగమేనా ? ఓడిపోయికూడ. నా శత్రువు గెలుపు పొందుతున్నాడే ! వినండి, వార్తాహరులారా. కోసలదేశ ప్రభువును బంధించి, నా నగరికి తెచ్చినవానికి పంద బంగరు రూకల బహుమతి యిస్తానని చాటింపు వేయించండి !" అని ఆజ్ఞాపించాడు.

వార్తాహరులు చాటింపు వేయించారు. ఆబాలగోపాలం విన్నారు. కాని వెంటనే, "శివశివా", అని అందరూ చెవులు మూసుకొన్నారు.

ఓడిపోయిన కోసలదేశ ప్రభువు అడవులు పట్టిపోయి. ఒక్కడై తాపసవృత్తిని అవలంబించాడు.

ఒకరోజున, ఎవరో ప్రయాణికుడు యెదురుపడి, "కోసల రాజ్యానికి బాట చూపిస్తారా ?" అని అడిగాడు.

"ఆ రాజ్యానికి దేనికోసం పోతున్నావు, మిత్రమా ?, అని ఆయన ప్రశ్నించాడు.

"నేను కులంబట్టి కోమటిని, గాలివానలో నా పడవ మునిగిపోగా, నేను దిక్కుమాలి, బికారి నయ్యాను. కోసలదేశ ప్రభువు దీనజనుల పాలిటి కల్పవృక్షమని విన్నాను. నా దుస్థితిచూచి ఆయన కరుణించి, బ్రతుకుదెరువు చూపగలడు. ఈ ఆశతోటి నేను ఆయన రాజ్యానికి పోతున్నాను," అని ఆ ప్రయాణికుడు బదులు చెప్పాడు.

ఆయన కనుకొలకులలో కన్నీరు తిరిగింది. వాటిని కప్పి పెట్టేందుకు ఆయన చిరునవ్వు నవ్వి. కొంచెంసేపు ఆలోచించి

నిట్టూర్పు విడిచి, "నాతోటి రండి. మీ కోరికను తీర్చగలవారివద్దకు తీసికొనిపోతాను," అన్నాడు.

రాచనగరు ప్రవేశించి, ఆ ముని, కాశీదేశ ప్రభువుకు నమస్కరించాడు.

"నేనే మునుపు కోసలదేశ ప్రభువును. నన్నుపట్టి యిక్కడకు తెచ్చినవానికి నూరు బంగరు రూకలు బహుమతి యిస్తానని తమరు మాట యిచ్చారు. ఈ నా స్నేహితునికి ఆ బహుమతి యిచ్చి, తమ మాట నిలబెట్టుకొండి!" అన్నాడు.

ఆస్థానికులు కొయ్యబారిపోయారు. తమ గుండెలలో లేచిన వుద్రేకాలను అణచుకొనేందుకు, సైనికులు కూడ తలపడ్డారు.

కాశీదేశ ప్రభువు చాలసేపు మునిని పరిశీలించి చూచి. లేచి నిల్చుని బిగ్గరగా నవ్వాడు.

"బందీ, చావుద్వారా నన్ను జయిస్తా మనుకొంటున్నావా? నీ కోరిక అదే అయితే, ఆ కోరికను నెరవేరనీయను సుమీ! నేడు గెలుపు నాది", అని ఆయన కొంతసేపు ఆగాడు. తిరిగి మాటలాడ మొదలుపెట్టి, కోసలదేశాన్ని తిరిగి స్వీకరించండి. మరొక మనవి. కోసలదేశంతోబాటు నా మనస్సునుకూడ తీసికొండి", అన్నాడు.

ముని చేతులు పట్టుకొని, సింహాసనంవద్దకు తీసికొనిపోయి దుమ్ముచేరిన ముని తలవెంట్రుకలమీద మణికిరీటం పెట్టాడు.

# గురుగోవిందుడు

గురుగోవిందుడు సిక్ఖులకు అధిపతి. ఇప్పుడు ఆయన ఓడి పోయివున్నాడు. తన పూర్వజీవితాన్ని గుర్తుతెచ్చుకొంటూ కూర్చునివున్నాడు. యవ్వనదశలో తాను కలగన్న ఆశలన్నీ అంతరించినవి. ఆయన మనస్సును ఎన్నో అనుమానాలు, ప్రశ్నలు వందలాదిగా లేచి బాధపెడుతున్నవి. తాను చివరకు సాధించినది శూన్యమేగాని, మరేదీ లేదా? ఆయన కెంతో దిగులు పుట్టింది, అలసట కలిగింది. ఆలోచనలో మునిగివున్నాడు. ఇంతలో పఠానుతెగకు చెందినవాడొకడు గోవిందుని సమీపించాడు. గోవిందువికి తాను ఒక గుర్రాన్ని అమ్మివున్నాడు. ఆ పైకం వసూలుచేసికొందామని యిప్పుడు వచ్చాడు.

"నన్నిప్పుడు విసిగించకు, భాయీ. పైకం రేపంటే రేపే చెల్లిస్తాను", అన్నాడు గోవిందుడు.

ఆ పఠానుకు కోపంవచ్చింది. "అదేమీ వల్లపడదు. పైకం యిప్పుడే యిక్కడే చెల్లించాలి", అని అరిచి, గోవిందుని చేయి పట్టుకొని లాగి, ఆయనను దొంగపని నిందించాడు.

మెరుపుతీగవలె పదనైన ఖడ్గం తళుక్కుమని మెరిసింది. మరి, ఆ పఠాను ప్రాణాలు విడిచి నేలపై పడిపోయాడు.

పిచ్చికోపాన తాను చేసిన పాడుపనిని గురించి గోవిందుడు బాధతో ఆలోచించసాగాడు.

"అనవసరంగా నేను నెత్తురు చిందించాను. నా ఖడ్గమే నన్ను పాపకార్యానికి దించింది. ఇక, జీవించినన్నినాళ్ళూ నేనూ ప్రాయశ్చిత్తం చేసికోవాలి", అనుకొన్నాడు.

చనిపోయిన పఠానుకు ఒక బిడ్డ వున్నాడు. ఆ బిడ్డను తెప్పించుకొని, గోవిందుడు తన బిడ్డవలెనే పెంచసాగాడు. ఆతనికి ఆయుధప్రయోగ విధులన్నిటినీ నేర్పాడు. ఇది చూచి, గోవిందుని అనుచరులు భయపడ్డారు.

"మాకు భయమవుతున్నదయ్యా! పులిపిల్లను ఎవడైనా మచ్చిక చేయగలడా? ఈ పఠాను కుర్రవాడు పెరిగి పెద్దకాగానే, తన కన్నతండ్రి గుణాలే వస్తాయి. తప్పదు", అన్నారు.

"పులిపిల్ల పెరిగి పెద్దపులి కాకపోతే, నేను నేర్పిన విద్య మరెందుకు?", అన్నాడు గోవిందుడు.

పసివాడు యువకుడయ్యాడు. గోవిందుని కన్నతండ్రివలెనే గౌరవించేవాడు. ఆయనను సదాకాచుకొని, నీడవలె అంటిపెట్టుకొని, మసలేవాడు. వృద్ధుడయిన గోవిందుని కుమారులందరూ యుద్ధమందు చనిపోయారు. వారిస్థానాన్ని యీ పఠాను యువకుడు ఆక్రమించాడు. ఒకరోజున అతడు గోవిందుని పాదాలను తాకి. "నేను ఆయుధాలను ప్రయోగించడం నేర్చాను, తమ సెలవైతే రాజసేనలోచేరి నా బ్రతుకు తెరువు చూచుకొంటాను," అని ప్రార్థించాడు.

"మొదట నీ శౌర్యాన్ని నేను పరీక్షించాలి. చేత కత్తి పట్టుకొని, రా నా వెంట", అన్నాడు గోవిందుడు.

వాళ్ళిద్దరూ మాటామంతీలేకుండా, అడవిలోపడి నడచి, సెల యేరును చేరుకొన్నారు. మోకాలి లోతుగల నీరు పటికవలె ప్రకాశి స్తూంది. ఆకాశంలో చీకటి వ్యాపిస్తూంది. గోవిందుడు అక్కడ ఆగి, "మామూద్, యిటువచ్చి. నేలను త్రవ్వు" అని ఆజ్ఞాపించాడు.

ఇసుకనుండి పెద్దబండరాయి ఒకటి బయలుపడింది. "ఈ నెత్తురు చారలు చూచావా? ఇవి నీ తండ్రి నెత్తుటి మరకలే. అతను నాకు ఒక గుర్రాన్ని అమ్మాడు. నేను పైకం చెల్లించ డానికి బదులుగా అతని తలను తెగనరికివేశాను. కాబట్టి పగ తీర్చుకో! నీ కన్నతండ్రి భూతమై దాహం దాహం అని అంగ లారుస్తున్నాడు. నేను అతని విరోధిని. నా నెత్తుటితో నీ కన్న తండ్రి దాహంతీర్చు!", అన్నాడు గోవిందుడు.

భయంకరమైన కోపపు కేక వినవచ్చింది, గాయపడిన జంతువువలె మామూద్ గోవిందుని మీదికి దూకాడు. గోవిందుడు చెక్కుచెదరలేదు. కలవరపడలేదు. అతని ముఖాన వెలిగే చిరు నవ్వు మాసిపోలేదు. పఠాను యువకుడు తన ఆయుధాన్ని ఆయన పాదాలకడ పడవేసి, వ్యాకులపాటుతో వెక్కివెక్కి ఏడువసాగాడు.

"అయ్యో, నా కన్న తండ్రినీ అతని వధనూ నేను మరచి పోయాను. ఆయనను ఎట్లో తమరినికూడా అట్లే ప్రేమించ నేర్చు కొన్నాను. నిదురిస్తున్న పామును తన్నిలేపకండి దాన్ని వస్తులుపడి, కృశించి చావనీయండి!" అని ప్రార్థించాడు.

ఆనాటినుండి పఠాను యువకుడు గోవిందుని సమీపానికి పోవడం మానుకొన్నాడు. ఎప్పుడైనావస్తే, నిరాయుధుడై మాత్రమే వచ్చేవాడు. ఒకరోజున సాయంకాలంవేళ, గోవిందుడు

ఆతనిని చదరంగానికి పిలిచాడు. మామూద్ ప్రతిసారీ ఓడి పోసాగాడు. ఏదో ఎత్తుగురించి దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు. ఇంతలో గోవిందుడు, చదరంగపు బొమ్మను ఒకదానిని చేతబట్టి మామూద్ ముఖాన విసరికొట్టాడు. అంతటితో వూరుకోక, "కన్నతండ్రిని వధించినవానితో చదరంగమాడే పిరికి పందకు ఓటమిగాక, గెలుపెట్లా కలుగుతుంది ?", అని ఎత్తిపొడిచి ఎగ్గరగా నవ్వాడు.

మెరుపుపాటున పఠాను యువకుడు బిచువాను ఒడిసి పట్టు కొని, గోవిందుని గుండెలలో దించాడు.

చావుపాలవుతున్న గోవిందుడు తృప్తిపడినట్లు, చిరునవ్వు నవ్వుతూ, "సెబాస్, బిడ్డా, సెబాస్, జరిగిన అన్యాయానికి, ధీర పురుషునికి తగిన తీరున పగతీర్చుకొన్నావు!", అని అన్నాడు.

# అంతిమ గీతిక

భోజుని రాజ్యములో, ఒకానొక కన్యక ప్రతిదినము దేవాలయానికి పోయి పాటలు పాడేది. ఆ పిల్ల తలిదండ్రు లెవరో తెలియదు. సంగీతాచార్యునికి ఒక శిశువు అడవిలో దొరికింది. ఆ శిశువే ఈ కన్య.

"ఒకరోజున ప్రొద్దుపొడిచేవేళ, ఏదో వింతరాగ మొకటి నాకు వినిపించింది. పూలబుట్ట చేతపట్టుకొని, అడవిలో పూవులేర బోయాను, ఈ బిడ్డ ఒక చెట్టు మొదట పడివుంది". అన్నాడు ఆచార్యుడు.

ఆయన చేతిలో ఆ శిశువు పెరిగి పెద్దది అయింది. సంగీత వాద్యమంటే ఆచార్యునికి ఎంత ప్రాణమో, ఆ బిడ్డపైకూడ అంత మమకారము. మాటలు నేర్వకమునుపే అ బిడ్డ పాటలు నేర్చింది.

అంతలో ఆచార్యుని కంఠస్వరము నీరసించింది. కను చూపు మందగించింది. అతని ఆలనాపాలనా పెంపుడు కూతురే చూచుకొనేది. ఆయనను పసిబిడ్డవలె లాలించేది.

ఆమె పాట వినడానికి దగ్గరనుండీ దూరంనుండీ యువకులు మూగేవారు. వారినిచూచి ఆచార్యునిగుండె సంచలించేది. తొడిమ దుర్బలమైనప్పుడు పూవు రాలిపోగలదని ఆచార్యుడుఎరుగును,

"నేను మిమ్ము వదలి ఒక్క క్షణమైనా మనలేను," అనేది ఆ కన్య.

"నన్ను ఎదలిపెట్టి సంగీతము నిన్ను చేపట్టింది. నీవే నన్ను వదలివెళ్ళినట్లయితే, నా జీవిత శ్రమ అంతా వృధా అవుతుంది." అనేవాడు ఆచార్యుడు.

అది ఫాల్గుణమాసము. ఆనాడు పూర్ణిమ. అప్పుడే వసంత కాలము మొదలయినది. ఆచార్యుని శిష్యులలో ముఖ్యుడు కుమార సేనుడు. అతడు ఆచార్యునికి నమస్కరించి యిట్లన్నాడు: "నేను మాధవి ప్రేమను పొందాను, తమ సెలవైతే, మేము పెళ్లి చేసుకొంటాము."

ఆచార్యుని కళ్ళలో నీళ్ళు తిరిగాయి. "నా వీణను తీసికొనిరా, నా ముందు రాజువలె నీవు, రాణివలె మాధవి కూర్చోండి," అన్నాడు.

వీణను చేబట్టి ఆచార్యుడు పాటను ఆలపించ సాగాడు. "ఇదే నా జీవితపు అంతిమ గీతిక," అన్నారు.

మొదటి చరణమును ఆలపించాడు. ఆ పైన పాడలేక పోయాడు. వాన చినుకులుపడి బరువెక్కిన పూవువలె అతని కంఠస్వరము వణకసాగింది చిట్ట చివరకు వీణను కుమారసేనుని చేతికి, తీసికొమ్మని యిచ్చాడు. తర్వాత మాధవిచేతిని కుమార సేనుని చేతితోకలిపి "నా బ్రతుకును నా పంచప్రాణాలను తీసికొండి," అన్నాడు. "నేను మొదలు పెట్టిన గీతికను పూర్తిచేసే బాధ్యత మీ యిద్దరిది." అన్నాడు.

మాధవీ, కుమార సేనులుకలిసి గొంతెత్తి పాడసాగినప్పుడు ఆకాశమూ, చందమామా కలసి గొంతులు కలపినట్లుగా వుంది.

సరిగా ఆ క్షణానికి రాజదూతవచ్చి తలుపు తట్టాడు.

వణుకుతూ వణుకుతూ, ఆచార్యుడులేచి, "ప్రభువుగారి కోరిక ఏమిటి ?" అని ప్రశ్నించాడు.

"తమ కుమార్తె అదృష్టము పండినది. ప్రభువువారు ఆమెను రమ్మంటున్నారు", అని రాజదూత చెప్పాడు.

"మాధవినా ? ప్రభువువారా ? ఎందుకు ?", అని ఆచార్యుడు ప్రశ్నించాడు.

"రేపు ప్రొద్దుట మహారాజకుమారి అత్తవారింటికి కాంభోజ రాజ్యానికి ప్రయాణమవుతుంది. మీ కుమార్తె రాజకుమారికి ఇష్టసఖిగా ఎన్నిక అయింది", అని రాజదూత వివరించాడు.

మునుముందు, మహారాజకుమారిగారి నెమలి పల్లకీ బయలుదేరింది. మెత్తటి పట్టుబట్టను కప్పివున్నారు. చుట్టూ ఆయుధాలు దాల్చిన రక్షకభటులు కాపున్నారు. దానివెంట మాధవి ఎక్కిన పల్లకి పోసాగింది. మాధవి కళ్ళలో తడియేలేదు. ఎండకు తెగవేగిన ఎడారి యిసుకలనుండి వచ్చే తీక్షమైన కాంతి ఆమె కళ్ళనుండి వెలువడసాగింది.

ఒక మహావృక్షమునుండి తునిగిపడిన రెమ్మవలె ఆచార్యుడు దారిప్రక్క దుమ్ములో కదలికలేకుండా పడివున్నాడు. అతని ప్రక్కన కుమారసేనుడు ఆజానుబాహువై నిశ్శబ్దముగా నిలచి వున్నాడు. అడవులలో పిట్టలు పాడుతున్నవి. మామిడి చిగుళ్ళ సువాసనతో గాలి కైపెక్కి వశము తప్పి వీస్తున్నది.

## శిక్ష

"రాజుగారి ఖజానాలో చోరీ! దొంగను పట్టి బంధించనైనా బంధించాలి; లేదా, రక్షకభటాధికారీ, నీ తలనైనా అర్పించుకోవాలి", అని రాజుగారు ఆజ్ఞాపించారు.

రాజుగారి కోపం ములుకోలవంటిదై పొడువగా, రక్షకభటులు నిద్రాహారాలు మాని, దొంగకొరకు గాలించసాగారు.

ఆ పట్నపు చివర, పాడుపడిన ఒక దేవాలయములో పరదేశి ఎవరో నిదురపోతున్నాడు. గుఱ్ఱాలను అమ్ముకొనేందుకు సొంతవూరు వదలి ఎంతోదూరం వచ్చివున్నాడు. దారిలో దోపిడిదొంగలు పైబడి, వున్నది అంతా వూడ్చుకొనిపోయారు. అతని మనస్సు వ్యాకులమైపోయింది. తిరుగుప్రయాణం మొదలుపెట్టాడు. ఆ రక్షకభటులు అతనిమీద దూకిపడి బంధించారు. ఊరుగాని వూరు, ఒంటరిగాడు. రక్షకభటులు అతని చేతులకుసంకెళ్ళు తొడిగి, కాళ్ళకు గొలుసులువేసి, రాజవీధి వెంబడి తీసికొనిపోతున్నారు. అతని పేరు వజ్రసేనుడు,

సాటిలేని అందగత్తెగా పేరుమోసిన శ్యామ, తన మేడకిటికీవద్ద కూర్చునివుంది. విసుగుపడి బడలికతో ఏమీతోచక, దారిని పోతూ వస్తున్నవారిని వంగిచూస్తూవుంది.

ఇంతలో ఆమెకళ్ళు బెదరి, చూపులు చెదరిపోయినవి. ఒళ్ళంతా కంపమెత్తింది.

అయ్యో! ఎవరా యువకుడు? దేవకుమారునివలె వున్నాడు! మామూలు దొంగనువలె, చెరసాలకు తీసికొని పోతున్నారే!

తన చెలికత్తెను పిలిచింది. "త్వరగా వీధిలోకిపోయి, రక్షక భటాధికారిని శ్యామ తన అల్పగృహానికి ఆహ్వానిస్తున్నదనీ, తన బందీతోబాటు దయచేయమనీ చెప్పు", అని పంపింది.

శ్యామ! ఆ పేరు విని రక్షకభటాధికారి పులకించిపోయాడు. పోతున్నవాడల్లా తిరిగి, శ్యామ యింటిలో ప్రవేశించాడు. అతని వెంట, తలవంచుకొని, నెమ్మదిగా వజ్రసేనుడు కూడ నడిచాడు.

"వేళ కాని వేళ యీ పిలుపేమిటి?", అన్నాడు అధికారి శ్యామతో. అతని ముఖాన చిరునవ్వు ఎంతో అపేక్షపూర్వకంగా వుంది.

కాని, ఆ బందీ, వంచిన తలనెత్తి, కరుకుగా, "ఏమిటి యీ చెలగాటం? చూడటానికి దేవతామూర్తివలె వున్నావు. అన్నెము పున్నెము తెలియని పరదేశి అగౌరవాన్నిచూస్తూ ఆనందిస్తావా? తనివితీరేటట్లు యీ తమాషాను చూడటానికా నన్ను నీదగ్గరకు రప్పించావు?" అని కోపంగా అన్నాడు.

శ్యామ బాధపడింది. "తమాషాకోసమనుకొంటున్నారా, పరదేశీ? ఈ నా ఒంటిమీద వున్న నగలన్నిటిబదులు. మీ చేతులకున్న సంకెళ్ళు వుంటే ఎంత బాగుండేది? మీకు జరిగిన

అవమానం, మీరు పడుతున్న బాధ నిజంగా నేనే పడుతున్న ట్లుంది". అని చెప్పింది.

నీళ్ళు తొణుకుతున్న కళ్ళతో శ్యామ, వజ్రసేనుని సాదరంగా చూడసాగింది. మెత్తని ఆ చూపులతో అతని అవమానాన్ని అంతటినీ తుడిచివేసేటట్లు వున్నాయి ఆ కళ్లు.

శ్యామ, రక్షకభటాధికారివైపు తిరిగి, "నాకున్న సంపద నంతా పుచ్చుకో. దానికి బదులుగా, యీ నీ బందీని విడిచిపెట్టు", అని ప్రార్థించింది.

"క్షమించు, శ్యామా! నీ ఆజ్ఞను పాలించలేను. రాజుగారి బొక్కసంలో దొంగలు పడ్డారు. ఒక మనిషి నిండుప్రాణాలు పోతేనేగాని, రాజుగారి కోపం తగ్గదు", అన్నాడు రక్షకభటాధికారి.

శ్యామకు విచారం అతిశయించింది. రక్షకభటాధికారి చేతులు రెండూ పట్టుకొని, "ఈ నీ బందీని వెంటనే చంపవద్దు. రెండు రాత్రులూ, రెండు పగళ్ళూ యితను బ్రతికి వుండేటట్లు చూడు. రెండు రాత్రులూ రెండు పగళ్ళూ మాత్రమే చాలు", నని బ్రతిమలాడెంది.

"సరే అట్లాగే చేస్తాను." అన్నాడు రక్షకభటాధికారి. రెండవరాత్రి తెల్లవారవస్తుందనగా, ఎవరో ఒక స్త్రీ చెరసాల కొట్టు తలుపు తెరిచింది. చేత దీపముంది. లోపల అంతులేని చీకటిలో కాలు మోపింది. తెల్లవారిన తర్వాత మూడబోయే ఉరి శిక్షకోసం యెదురుచూస్తున్నాడు, బందీ వజ్రసేనుడు. కడసారి ఈశ్వరుని ప్రార్థిస్తూ మైమరచివున్నాడు. ఆమె చేసిన సైగతో కారాగృహ రక్షకులు అతని గొలుసుకట్లను విప్పివేశారు. దోషి తల పైకెత్తాడు. నిర్విణ్ణుడయ్యాడు. ఎదుట నిండా విప్పారిన తామరపూవువంటి సాటిలేని ముఖం కనుపించింది.

"భయ విహ్వాలమైన కటిక చీకటి రాత్రి చివర. వేగు జుక్కను ముందిడుకుని వచ్చే ఉషస్సువలె, నీవు నా చీకటి లోగిలికి వచ్చావు. చావు పాలవుతున్నవాని ప్రాణాగ్నివి. దుర్గతి పాలైనవాని పాలిటి విముక్తివి. ఎవరు నీవు ? నీపేరేమి ? దయ మాలిన యీ క్రూర నగరాన, రూపుదాల్చిన కరుణవా ?" అని బందీ ఆమెను కంపించే స్వరాన ప్రశ్నించాడు.

"రూపుదాల్చిన కరుణ ? నేనా ?" అని ఆమె ఎదురుప్రశ్న వేసింది. వేసి, బిగ్గరగా ఖంగుమనేటట్లు నవ్వసాగింది. వేనవేల కంచుగంటలు మ్రోగుతున్నట్లుగావున్న ఆ నవ్వుల సవ్వడికి చెరసాల మేల్కొన్నది. వర్ణింప నలవికాని ఏదో ఘోరభయంకర ధ్వని చరిస్తే మేల్కొనేటట్లు మేల్కొన్నది బందిఖాన. పిచ్చెత్తి నట్లు నవ్వుతూ, నవ్వుతూ, ఉన్నట్లుండి ఆమె కన్నీరు మున్నీరుగా యేడ్వసాగింది. ఏదో తెలియని బాధ ఆమె మనస్సును ముక్కలు ముక్కలుగా చేసింది. ఆశలన్నీ అంతరించినట్లుగా ఆమె కుమిలి, కుమిలి ఏడ్చింది.

"ఈ నగర వీధులలో పరచివున్న కటిక రాళ్ళన్నిటి కాఠిన్యము ఈ శ్యామ హృదయ కాఠిన్యము ముందు ఏ పాటి ?", అన్నది. ఇంతలో తనను తాను సమాళించుకొని, బందీ చేతిని గట్టిగా పట్టుకొని, చీకటి కొట్టునుంచి, బందిఖానా లోగిలినుంచి అతన్ని తీసికొనిపోయింది.

నదిమీది చీకటి విరిగి, రాత్రి తెల్లవారింది. గట్టున ఒక పడవ లంగరువేసి వుంది.

"రా, పరదేశీ", అని ఆ స్త్రీ పడవలో యెక్కి కూర్చుంది. "రా, నా ప్రాణ ప్రియా ! గతకాలపు బంధాలన్నీ తెగిపోయాయి.

నా బ్రతుకును నీ బ్రతుకుతో కలుపుతున్నాను, నీవే నా ప్రభువువు, నా ప్రాణ ప్రియుడవు. నీతో కలిసి, తెలియని యీ నదీ ప్రవాహ మార్గాన బడి, ఎటో తేలిపోవడానికి సిద్ధమై వచ్చాను, రా", అని అతన్ని పిలిచింది.

పడవ సులువుగా నీటిమీద జారినట్లు ముందుకు పోసాగింది. నది గట్లులందు పెరిగిన గుబురులనుండి పిట్టలు ఉల్లాసంగా పాడు తున్నాయి. వజ్రసేనుని యెదురు రొమ్మున శ్యామ తన తలను ఆన్చి అదిమింది. వజ్రసేనుడు శ్యామ తలను నిమురుతూ, "నన్ను చెరనుండి విడిపించడానికి ఎంత ధనం ఖర్చుచేశావోగదా! నేనా, ఓకారిని. నీకు యెంత ఋణపడివున్నానో తెలియచెప్పవూ?" అని అడిగాడు.

కాని, ప్రేమాతిశయాన ఒళ్ళు వశముతప్పిన శ్యామ, ప్రియునికి మరింత దగ్గరగా జరిగి, "ఇప్పుడు కాదు. ఆమాటలకు యిదికాదు అదను," అని చెప్పింది.

గాలి వడీ, ప్రవాహపు విసురూ కలిసి, ఆ పడవను దూరం, యింకా దూరం, త్రోసినవి. ఎండ కరుకుచూపింది. మధ్యాహ్నపు ప్రశాంతి నెలకొన్నది. ఆ వూరి స్త్రీలు నదిలో జలకమాడి, కుండ లను నీటితో నింపి, వాటిని పిరుదుల కాన్చి, తడి బట్టలతో తిరిగి పోయారు. గట్లు సర్దుమణిగి వున్నాయి, మెట్లవరుసవున్న చోటికి పోయి పడవ ఆగింది. నీడపట్టున గూళ్ళలో కూర్చున్న పిట్టలు కూడ మెదలకున్నాయి. మిడతలు మట్టుకే రొదపెట్టుచున్నాయి.

పంటకొరుకు వచ్చిన ధాన్యపు చేల సువాసనలతోటి బరువైన చిరుగాలి వీచి, శ్యామ మేలిముసుగును తొలగించి వేసింది,

ఈపాటికి వజ్రసేనుడికికూడ ప్రణయమనే వ్యాధి వ్యాపించింది. అతని గుండె నిండుగావుంది. కంఠస్వరములో ఏదో బటువైన వుద్రేకం తొణికిసలాడుతున్నది. శ్యామ చెవిలో మెల్లిగా వజ్ర సేనుడు మాటలు వూదసాగాడు.

"శ్యామా, నన్ను సంకెళ్ళనుండి విడిపించావు. ఆ సంకెళ్లె పెళుసైనవి. కాని తిరిగి నీవే నాకు సంకెళ్ల తొడిగావు. ఇవి బటు వైనవి. ఇప్పుడైనా చెప్పవా, ప్రేయసీ. సామాన్యులకు అలవిగాని తీరున నన్ను ఏ విధంగా విడిచిపెట్టించావు? నా ప్రాణాలతో నీ ఋణాన్ని తీర్చుకొంటాను. నా ప్రాణాలు నావి కావు; యిక నీదట నీవి", అన్నాడు.

శ్యామ తిరిగి మేలిముసుగు సవరించుకొని, "ఇప్పుడు కాదు. ఆ మాటలకు యిదికాదు అదను", అని చెప్పింది.

ప్రొద్దుక్రుంకిన దిక్కును దాటి సూర్యరశ్మి వెళ్ళిపోయింది. పడవ మళ్లీ ఆగింది. శశిరేఖ నది నీటిమీద మెరుస్తున్నది. గట్టున పేరుకున్న మసక చీకటి, కీచురాల గోలకు, గజగజ వణకిపోతున్నది. వజ్రసేనుడు వెల్లకిల పడుకొని వున్నాడు. శ్యామ అతనిమీదుగా వంగి కూర్చునివుంది. ఆమె తలవెంట్రు కలు కుప్పగా నల్లగా అతనిమీద ప్రవహించి పడుతున్నాయి. శ్యామ మనస్సు కలగుండు పడింది, శ్వాస పీల్చుకోవడానికీ, విడువడానికీ నడుమ అట్టే యెడంలేదు.

"మీ ప్రాణాలు కాపాడడానికి నేను చేసిన పని కటిక పని. మీకు అది చెప్పడం అంతకంటె కటిక పని. ఈ కథ విన్న తర్వాత వెనువెంటనే దానిని మరచిపొండి.

"ఉత్తీయుడు పసివాడు. యౌవన ప్రాంగణమందు తొలి అడుగు పెడుతున్నవాడు. నన్నెంతో యిదిగా ప్రేమించాడు. పిచ్చిగా, వెర్రిగా ప్రేమించాడు. నేను యిది చేయమన్నానో లేదో, వెంటనే సరేనన్నాడు. మిమ్ము యే దొంగతనానికైతే శిక్షించారో, ఆ దొంగతనం చేసింది తానేనని ఒప్పుకొన్నాడు. ప్రాణాల నర్పించాడు. మీరే నా ప్రభువు. మీకోసమే యీ పాపిష్టి పని చేశాను, అది నాకు అవమానదాయకం కాదు. పైపెచ్చు ప్రతిష్ఠాజనకమైనపని." అని శ్యామ వివరించి చెప్పింది.

నిశ్శబ్దమనే సముద్రాన దిగబడివున్న తోపులు పక్షులనిద్రకు కాపున్నవి. చీకటిగట్టు ముందుకు వ్యాపించి, నదిమీదుగా, నల్ల కప్పువలె దట్టపడసాగింది. ఆ స్త్రీ దేహాన్ని నిమురుతూవుండిన చేతులు వున్నట్టుండి పట్టువిడిచి, దూరమైనవి. వజ్రసేనుడి పసి గుండె హఠాత్తుగా కఠినమయింది. అతడు బండబారాడు. తునా తుంటలయిన పూదీగెవలె శ్యామ కంగారుపడి, అతని పాదాలవద్ద కుప్పగూలి పడింది. అతని కాళ్ళను గట్టిగా పట్టుకొని, "భిక్ష పెట్టండి-క్షమాభిక్ష పెట్టండి. ఈశ్వరు డెట్లాగూ నన్ను శిక్షిస్తాడు. మీరుకూడా శిక్షిస్తారా? వద్దు వద్దు, ప్రభూ. నన్ను క్షమించండి" అని ప్రార్థించింది,

వజ్రసేనుడు ఆమె కౌగిలిని వదల్చుకొన్నాడు. అతని కళ్ళు చింతనిప్పులైనవి.

"ఛీ, ఛీ! ఈ నా అల్పప్రాణాలను అంతపనిచేసి ఎందుకు కాపాడవలసి వచ్చింది? నీవు చేసినది ఘోరమయిన నేరం. నాకోసం చేశావు. కాబట్టి ఆ పాపం నాకుకూడ అంటుకొంది. నేను బ్రతుకుతున్న ప్రతి క్షణమూ నీచమైనది. ఎందుచేత?

నా బ్రతుకు నీకు ఋణపడి వున్నందుచేత! నీ పాపకార్యంవల్ల నేను బ్రతుకుతున్నాను కాబట్టి!", అన్నాడు.

ఉన్నట్టుండి పైకిలేచి, తోపులలోకి పోసాగాడు, కాలి క్రింద పడిన ఎండుటాకులు గలగల చీకటిని కలతపెడుతున్నవి. గాలి ఆడని నడి అడవిలో, ఓషధి వృక్షాల పదను వాసనలు దట్టమై వున్నవి. శాఖోపశాఖలుగా విస్తరించుకొని వున్న ఎత్తైన చెట్లు చీకటిలో వికృతరూపాలతోటి భయము గొల్పుతున్నాయి. పోయి పోయి తీగెలు గుబుర్లు గుబుర్లుగా గోడవలె అల్లుకొనిపోయి వున్నచోట కాలిబాట ఆగిపోయింది. అటవీ రాజ్యాన్ని అతిక్ర మించి వచ్చినవారికి మూకీ హెచ్చరికలవలె వేయిచేతులు పైకి లేచినట్లున్నవి ఆ తీగలు. ముందుకుపోయే వీలులేక, అతనక్కడ కూర్చున్నాడు. మరి, అతని వెనకనే నీడవలె అంటిపెట్టుకొని వచ్చింది ఆమె. నెత్తురు లోడుతున్న ఆ పాదాలతో ఆ సుకుమారి అంతదూరం యింత మొరకుదారినిబడి వచ్చింది. అతను గమ నించాడు. అతని పిడికిలి బిగిసింది. గొంతు గాంఢ్రించింది.

"నన్ను విడిచిపెట్టవా యేమిటి?" అన్నాడు.

మెరపు మెరసినట్లు, అతనిమీద పడి, కన్నీటి వరదను విడిపిచింది. ఆమె ఒళ్లు, వెంట్రుకలు, స్పర్శ, ముద్దులూ, రొప్పూ అతన్ని తడిపివేశాయి. "పోనివ్వను, మిమ్మల్ని విడిచి వెళ్ళను" అన్నది. "శిక్షించండి, మీచేతులతో మీరే శిక్షించండి, గాయ పరచండి, ప్రాయశ్చిత్తం చేయండి, కాని మిమ్మల్ని పోనివ్వను" అని ఏడ్చి చెప్పింది.

చుక్కలే లేని చీకటి భయపడింది. అమె విలాపధ్వని మధ్యలో అకస్మాత్తుగా ఆగిపోయింది. దాని నెవ్వరో నులిమి, అణచి వేసినట్లుంది. నేల లోతులలోవున్న వేళ్లుకూడ భయపడి

గడగడ వణకినవి. ఏదో ఆకృతి వ్రాగిపోయింది. కదలలేదు. మెదలలేదు.

వజ్రసేనుడు నదీతీరానికి తిరిగివచ్చేసరికి ప్రొద్దుపొడిచింది. ఎండలో దేవాలయము గాలిగోపురపు త్రిశూలము తళ తళ లాడు తున్నది. ఒంటరిగావున్న యిసుకమీద వజ్రసేనుడు కూర్చున్నాడు. బ్రతుకే శుష్కించి ఆగిపోయినట్లయింది. పిచ్చివానివలె, సూర్యుడు చెరిగే నిప్పుల యెండను ఖాతరు చేయకుండా, మధ్యాహ్నము దాటుతున్నా, అట్లాగే వుండిపోయాడు.

"ఎవరయ్యా, పరదేశీ, నువ్వు ? ఇల్లులేదాఏమిటి, అయ్యో పాపం మాయింటికి వచ్చి సేద దీర్చుకొందువుగాని రారాదూ ?" అని వచ్చే పోయే స్త్రీలు అడుగుతున్నారు.

కాని అతను సమాధానమే యివ్వలేదు. గొంతు ఎండి పోయింది. కాని ప్రవాహజలాన్ని ముట్టనైనాముట్టలేదు. చిట్టచివరకు పగలు గతించిపోయిన తర్వాత, పైకిలేచి, పడవవైపుగా తూలుతూ సోలుతూ పోయాడు. ప్రాణాంతకమైన అగ్నిజ్వాలచే ఆకర్షింపబడిన చిమ్మట పురుగువలె పోయాడు.

పడకమీద కాలిఅందె ఒకటి పడివున్నది. దానినెత్తి ఎదురురొమ్ముకు హత్తుకొన్నాడు. దాని చిరుగజ్జెల గలగలలు అతని పాలిటికి వేనవేల బాణాలై, గుండెను రంపకోత కోయ సాగినాయి.

పడక చివరనీలి వుడుపులు గుట్టపడి వున్నాయి. సున నాణ్యపు దుస్తులకు మోమాన్చి, వాటిని తాల్చిన ఒంటి సువాసన లను పదే పదే పీల్చుకుంటూ, వజ్రసేనుడు యింకా తృప్తిపడ నట్లున్నాడు.

శశిరేఖ ఆకాశంలో వాలుగా తోచింది. వజ్రసేనుడు తోపులవైపు చూపు సారించి, చేతులు రెండూ బారచాచి, "రా, ప్రియతమా, తిరిగి రా, ప్రేయసీ", అని గొంతెత్తి పిలిచాడు.

తోపుచీకటి చీల్చుకొని మానవాకృతి ఒకటి బయల్పడింది. "రా, ప్రేయసీ! తిరిగి రా, ప్రియతమా!", అని మళ్ళీ పిలిచాడు. అప్పటివరకు అస్పష్టమై వుండిన మానవాకృతి యిప్పుడు స్పష్టంగా కనుపించసాగింది,

ఆ స్త్రీ వజ్రసేనుని పాదాలకడ పడిపోయింది.

"క్షమించండి ప్రభూ! నేనింకా బ్రతికే వున్నందుకు క్షమించండి, శిక్షించబూనుకొన్న మీచేయి పూర్తిగా దయకోల్పోలేదు," అన్నది.

ఒక్కక్షణమే ఆమెను మ్రింగివేసేటట్లు చూశాడు. ఆక్షణమందు ఆగొన్నట్లుగా చేతులు చాచి ఆమెను పట్టబోయాడు. కాని అంతలో ఒక విదిలింపుతో తనను తానే సమాళించుకొన్నాడు. దూరం తొలగిపోయాడు.

"తిరిగి ఎందుకు వచ్చావ్? మళ్ళీ వచ్చావెందుకు?" అని కఠినంగా అరచాడు.

కాలిఅందె అతనిచేతిని దహించినట్లయింది. దానిని క్రిందికి విసరివేశాడు, సునునాణ్యపు నీలి వుడుపులను గిరాటువేశాడు.

అటువైపు తిరిగి, 'వెళ్ళిపో! వదలిపో! తిరిగి నాముఖం చూడకు, పో," అని అరచాడు,

ఆమె కొరడుబారిపోయింది. తల వంచుకొని, వంగి చివరిసారి నమస్కారపూర్వకంగా అతని పాదాలను తాకింది. లేచి, నదిగట్టునబడి, తోపులలోకి వెళ్ళిపోయింది. మెలకువరాగానే, రాత్రి మరపునబడి వాడిపోయే దివ్యస్వప్నంవలె ఆమె అంతర్థానమయింది.

# లక్ష్యసిద్ధి

ముని అడవిలో, కఠినమైన తపస్సులో మునిగి ఒంటరిగా వున్నాడు. మానవులకు అనంతమైన బ్రతుకును సాధించవలెనని మానవుడు అమరుడు కావలెనని, తపస్సు చేస్తున్నాడు. అదే అతని గురి.

అడవిచివర, కట్టెలుకొట్టి బ్రతుకుసాగించే వాళ్లున్నారు. అక్కడ ఒకయువతి వుంది. రోజూ, దోసిళ్ళనిండా పళ్ళుపట్టుకొని పోయి మునికి సమర్పించేది. ఏటికిపోయి నీళ్ళుతెచ్చి యిచ్చేది.

అతని తపస్సు మునుపటికంటె కఠినమయింది. ఇప్పుడు పళ్ళుకూడ తినటంమానినాడు. అతని పాదాలకడ పడి కుళ్ళిపోతున్న పళ్ళను, పిట్టలు ముక్కులతో పొడిచి పొడిచి, తినసాగినవి. మరి కొన్ని రోజులకు ఆ కుర్రది ఆకుదోనెలలో పట్టితెచ్చిన నీళ్ళు కూడ తెచ్చినట్లే వుండిపోసాగినవి.

"మరి, నేను చేయవలసింది యికయేమీ లేదా ?", అని ఆకుర్రది తనలోతాను దిగులుపడసాగింది.

అడవిపూవుల నేరితెచ్చి, ఆయనముందు పెట్టసాగింది. ముని దానిని గమనించనేలేదు.

ప్రొద్దు నడినెత్తికి వచ్చినప్పుడు, ప్రక్కన నిలుచుని, అతని తలమీదుగా పైటచెరగు నెత్తిపట్టి, నీడ నివ్వసాగింది. కాని, మునికి ఎండైనా, నీడైనా ఒకటే.

చందమామ లేని రాత్రి చీకటిగోయి కాగా, కంటికి కునుకు మాని, ఆ కుర్రది రెప్పార్పకుండా కూర్చుని, మునికి కాపుండేది. అతనికి భయమేమీ లేకపోయినా, అమె కావలా కాసేది. ఆమె వున్నట్లుకూడ అతనికి తెలియదు.

మునుపు ముని యిట్లాగు అశ్రద్ధ చూపేవాడు కాదు. ఒక్కొక్కసారి ఆమెవైపుచూచి, "బాగున్నావా ?" అని కుశల ప్రశ్న లేసేవాడు.

"బాగూ, ఓగూ - అంతా ఒకటే నాకు. కాని, తమరు___ మీ వారెవరూ లేరా ? తల్లీ, తోబుట్టువూ ఎవరైనా వున్నారా ? తమనుగురించి శ్రద్ధచూపేవారు ఎవ్వరూ లేరా, ?" అని అడిగేది.

"నా కెందరో చుట్టాలు, కాని వారేమి చేయగలరు ? చావు లేకుండా చేయగలరానాకు, ?" అనేవాడు.

"బ్రతుకు అనేదానికి అంతమనేది ఒకటి వుంది కనుకనే, అది అంటే మనకంత ప్రాణం. ఏమంటారు ?" అని అడిగేది.

"అనంతమైన జీవితంకొరకు నేను వెదుకుతున్నాను. మానవులను అమరులుగా చేస్తాను," అనేవాడు. మరేదోకూడ చెప్పేవాడు. కాని అందులో సగం తనకు తానే చెప్పుకునేవాడు. ఆ పసిదానికి అదేమీ బోధపడేదికాదు. ఏదో బరువుగానూ, కొరతగానూ, వుండేది. కల్లోలపడేది. మబ్బులు కుండపోత మొదలెట్టక ముందు, నెమలి మనస్సు యెట్లుంటుందో, ఆ చిన్నది అట్లుండేది.

రోజులు గడుస్తున్నవి. ముని యిప్పుడు, పలుకే బంగార మైనట్లు, మౌనవ్రతం పూనాడు. వస్తూపోతూవున్న కుర్రదానితో ఒకమాటకూడ మాట్లాడడము లేదు.

రోజులు గడుస్తున్నాయి ముని యిప్పుడు మూసినకన్ను తెరవడమేలేదు. వస్తూపోతూవున్న చిన్నదానిని ఒకచూపుకూడ చూడడము లేదు.

తమ యిరువురిని యీ తపస్సు యోజనాలమేరకు వేరు చేస్తున్నదని ఆ చిన్నది అనుకొన్నది. తామిద్దరూ బారెడు దూరము లోకి రావలెనన్నా, వెయ్యి సంవత్సరాలు పడతాయేమో! ఆ కుర్ర దాని గుండెనుండి భ్రమలన్నీ వైదొలగాయి. కాని అప్పుడప్పుడు, వెక్కి వెక్కి ఏడ్చేది. "రోజుకు ఒక్కసారి మాట్లాడినా, కాలం హాయిగా గడిచేది నాకు. ఒక్కపండు తీసికొన్నా, తిండిరుచించేది నాకు", అని తలపోసేది.

ఈ కబురు దేవలోకానికి పోయింది. భూమికి అంటిపెట్టు కొని వుండవలసిన మానవుడు స్వర్గానికి అర్రు చాస్తున్నాడు! ఎంతపొగరు! ఎంతసాహసం!

దేవ ప్రభువైన ఇంద్రుని ముఖం కోపాన కెంపెక్కింది. కాని అతని గుండె మట్టుకు దడదడ లాడసాగింది. "ఆయుధాల బలంచేత, రాక్షసులు స్వర్గలోకాన్ని ప్రవేశించాలనుకొన్నారు. వారిని ఆయుధాలతోటే యెదుర్కొన్నాము. కాని యిప్పుడు ఒకా నొక మానవుడు తపోబలంచేత స్వర్గాన్ని అందుకోవాలని చూస్తు న్నాడు - ఏమిచేయడం? లొంగవలసిందేనా అతనికి?" అని ఆలోచించాడు.

స్వర్గలోకపు నర్తకియైన మేనకనుపిలిపించి, "భూలోకానికి అవతరించి, నీ రూప విలాసాలతో ఆ మునిని భ్రమింపజేసి, అతని తపోబలాన్ని నాశనం చేయవలసింది," అని ఆజ్ఞాపించాడు.

"ప్రభూ, కేవలం ఒక మానవమాత్రుణ్ణి ఓడించడానికి స్వర్గలోకపు సాధనాలు వాడవలసివస్తే స్వర్గమే ఓడిపోయినట్లవు తుంది. ఈ మాత్రపు సాధనాలు భూలోకపు ఆడదాని చేతిలోకూడా వున్నాయికదా, ?" అని మేనక చెప్పింది.

ఇంద్రుడు యీ యుక్తిని గమనించాడు.

వసంతకాలములో, మలయమారుతం వీస్తుంది. మాధవీలత ఒంటినిండా పూలు తొడుగుకొంటుంది. ఏదో దివ్యలోకములో మంత్రసీమలో బయలుదేరిన మలయమారుతం ఆ కుర్రదానిని తాకింది. తాకిందోలేదో, ఆ చిన్నదాని ఒళ్లు కొత్త శోభతో పొంగిపోయింది, ఆ పసిదానిగుండెలో కోరిక మొనసూపింది. పూదేనె మత్తులో పరవశమైపోయిన తుమ్మెదగుంపువలె ఆయువతి భావాలు పోసాగినవి.

బాధాకరమైన కఠినతపస్సులో ఒకభాగం సరిగా ఆ సమయానికే ముగిసింది. కాని ముని అడవిలోపలికి యింకా లోలోపలికి, ఎంతోదూరాన వున్న కొండగుహ పట్టుకు పోబోతాడు. కళ్లు తెరిచాడు. మరి, పోవాలి,

ఎదుట, ఆసుందరి కనుపించింది. తలలోపూలు, రంగు చీర, ఎవరీ స్త్రీ ? తెలిసిన మనిషిలాగానే వుంది. కాని పూర్తిగా తెలిసినమనిషిలాగు లేదు. రాగముమట్టుకే గుర్తుకువచ్చి, మాటలు గుర్తురాని పాటవలెవుంది. రేఖలుమాత్రమే గీసి, చిత్రకారుడు

కొంతకాలం పూరకేవుండి, తిరిగి వుత్సాహం వచ్చినప్పుడు పూర్తి చేయబూనుకొన్న చిత్రంవలె వుంది.

ముని లేచాడు. "నేను దూరం వెళ్లిపోవాలి", అన్నాడు.

"ఎందుకు, స్వామీ ?". అని అడిగింది ఆ యువతి.

"నాతపస్సు పూర్తిచేసేందుకు", అన్నాడు.

చేతులు మోడ్చి, "స్వామీ, తమదర్శన మైతేనే చాలునే నాకు. ఆదర్శన భాగ్యంకూడ లేకుండాచేస్తారా ?", అని దీనంగా అడిగింది.

ముని కూర్చున్నాడు. దీర్ఘంగా చాలసేపు ఆలోచించాడు. తిరిగి, నోరు మూతపడింది.

తన కోరికను మన్నించాడు ! కాని అతని విధేయతను చూచి ఆ కుర్రది బాధపడింది. గుండెలో దబ్బనం చొనిపి నట్లయింది.

"నే నెంత ? నా విలువెంత ? ఆయన లక్ష్యసిద్ధికి అడ్డు నిలిచేందుకు నే నెవతెను ?" అనుకొన్నది.

ఆ రాత్రి. ఆకుల పడకమీద నిద్రపోకుండా పండుకొని, తన గురించి తానే భయపడింది.

మరునటిరోజు, పళ్లు పట్టుకొని మునివద్దకు పోయి నిలుచుంది. ఆమె చేతినుంచి ఆయన ఒక ఫలం తీసికొన్నాడు. ఆకు దోనెలో నీరుపట్టి తెచ్చింది. ఆప్యాయంగా పుచ్చుకొన్నాడు. ఆ కుర్రదాని గుండెలో సంతోషం పొంగి పొరలింది.

కాని, మరక్షణమే. నదిగట్టున చెట్టునీడలో కూర్చుని వున్నప్పుడు. ఆ చిన్నదాని కళ్ళనుండి అప్రయత్నంగా అశ్రువులు

అంతులేకుండా పొంగి పొర్లసాగాయి. వాటిని ఆపేందుకు ఎంతో ప్రయత్నించింది. కాని అది వృథా అయింది. తా నెందుకు యీ తీరున బాధపడుతున్నదో తనకే తెలియదు.

మునిని సమీపించి. నమస్కారపూర్వకంగా ఆయన పాదాలను తాకి, "తాము నన్ను ఆశీర్వదించాలి. స్వామీ!". అని ప్రార్థించింది.

"ఎందుకేమిటి?", అని అడిగాడు.

"నేను దూరం వెళ్ళిపోతున్నాను," అన్నది ఆ చిన్నది.

ముని ఆమెను ఆశీర్వదించాడు. "సరే. పోవలసివుంటే వెళ్ళు! మనోరథ ప్రాప్తిరస్తు! ఇష్టఫల సిద్ధిరస్తు!"

ఎట్టకేలకు అతని తపస్సు పూర్తి అయింది.

ఇంద్రుడు ప్రత్యక్షమయ్యాడు.

"మునీ. గెలుపు నీదే! స్వర్గలోకం ప్రవేశించవచ్చు," న్నాడు.

"స్వర్గం నాకిక అక్కరలేదు," అన్నాడు ముని,

"అయితే, మరేవరం కావాలి,?" అని అడిగాడు ఇంద్రుడు.

"కట్టెలుకొట్టే వారింటి కుర్రది కావాలి," అని ముని జవాబిచ్చాడు.

# కార్మికుల స్వర్గాన కళాప్రియుడు

వస్తువులు వాడుక కోసమేనని ఎప్పుడూ అతను అనుకో లేదు. పనీ, పాటాలేదు. కనుక పిచ్చిగుబుళ్ళకు మనస్సు అప్ప గించేవాడు. స్త్రీలు, పురుషులు, దుర్గాలు, భవనాలు – వీటి బొమ్మ లను చేసేవాడు. ఆ చిట్టి మట్టి బొమ్మలకు అక్కడక్కడ అలంకా రాలుగా గవ్వలను పెట్టేవాడు. బొమ్మలు వేసేవాడు. ఈ పనికి మాలిన, అక్కరలేని వాటికై కాలాన్ని అంతా వృథాచేసేవాడు. నవ్వుల పాలయ్యాడు. ఈ పిచ్చిపనులను విడిచిపెట్టుతానని అప్పు డప్పుడు శపథాలు చేసేవాడు, కాని అవి అతనిమనస్సులో తారట్లాడుతూనే వుండేవి. కుర్రవాళ్ళు కొందరు పుస్తకాలను ముట్టడమే అరుదయినా, పరీక్షలు మట్టుకు ఎటోనెగ్గుతారు. ఇత గానికికూడ అట్లాంటిదే జరిగింది. భూమిపై బ్రతికినన్నినాళ్ళూ యితగాడు చేసినవన్నీ పనికిమాలిన దండుగపనులే. కాని చనిపో యాడో లేదో, వెంటనే స్వర్గలోకపు ద్వారాలు బారుగా తెరుచు కొని, లోపలికి ఆహ్వానించాయి యితన్ని. తలరాత అనేది స్వర్గ లోకంలో కూడా వుంటుంది, అందుచేతనే, యితగాణ్ణి వెంటబెట్టు కొని పోతుండిన దేవదూత పొరపాటుపడ్డాడు. కార్మికుల స్వర్గాన యితగాణ్ణి ప్రవేశపెట్టాడు.

ఈ స్వర్గంలో అన్నీ వుంటాయి కాని, తీరుబడి ఒక్కటే వుండదు.

"భగవంతుడా! ఒక్కనిమిషంకూడా తీరికలేదు మాకు." నేవాళ్ళు యిక్కడి మగవాళ్లు. "కానీయండి. కానీయండి. కాలం రెక్కలు కట్టుకొని ఎగిరిపోతున్నది." అనేవాళ్లు యిక్కడి ఆడవాళ్లు. ఎవరినోట బట్టినా, "సమయం అమూల్యం." అనేమాట వినవచ్చేది. "చేతులనిండా పనివుంది. ప్రతి ఒక్క నిమిషాన్ని పూర్తిగా వాడుకోవలసిందే." అని నిట్టూర్చేవాళ్లు. కాని ఈమాటలు వాళ్ళను సంతోషపెట్టి, హుషారిచ్చేవి.

భూమిమీద బ్రతికివుండి నన్నినాళ్ళూ, పనికివచ్చే పని పీస మెత్తుకూడా చేయనివాడు యీ కార్మిక స్వర్గంలోనికి కొత్తగా వచ్చాడు. ఈ లోకపు ఆచారాలకీ యితనికి చుక్కెదురు. ఊగుతూ, జోగుతూ, మైమరచి, వీధులలోబడి పోతూపోతూ, గబ గబ పోతున్నవారిని ఢీకొట్టేవాడు. పచ్చిక బయళ్ళలోనో, సరసర పోయే వాగుల దగ్గరనో పవ్వళించి వుండేవాడు. పని తెమలని రైతులు మందలించేవాళ్ళు. ఎప్పుడూ యితగాడు ఎవరో ఒకరి పనికి అడ్డువచ్చేవాడు.

అడ్డువచ్చిన దానినల్లా త్రోసుకొని ముందుకుపోయే కుర్రది ఎవరోగాని, ప్రతిరోజూ వాగువద్దకు వెళ్ళి, కుండలో నీళ్ళు నింపుకొనేది. ఆ వాగు మూగది. కార్మికుల స్వర్గంలో వుండే వాగులన్నీ అదే తీరు. పాడితే వృధాశ్రమ తప్ప. ప్రయోజనమేమీ వుండదని వాగులు పాడ మానుకొన్నవి.

గిటారు అనే వాద్యపు తీగెలమీద మంచి వాద్యగాని చేయి యేవిధంగా జరజరలాడుతుందో, ఆకుర్రది బాటమీద అట్లాగే గబ గబ నడిచేది. తలకూడ సరిగా దువ్వుకోలేదు. నల్లటి ఆశ్చర్యం

వంటి ఆమెకంటిని తొొంగిచూద్దామని కాబోలు, నొసట ముంగు రులు ప్రశ్నలవలె వంగి వంగి పడివున్నాయి.

ఆ వాగువద్ద ఆ సోమరి నిలబడి వున్నాడు. ఒక్కాగా నొక్క బిచ్చగాణ్ణి చూచినప్పుడు మహారాజ కుమారి గుండె నీరై పోయినట్లుగా, యితగాణ్ణి చూడగానే ఆ స్వర్గలోకపు యువతిలో జాలి పొంగింది.

"అరరె! పాపం, చేసేందుకు మీకు పనియేమీ లేన ట్లుందే!", అన్నది ఆ కుర్రది.

అతను నిట్టూర్చాడు. "పని! నాకు తీరికవుంటేగా, పనీగినీ చేయడానికి?", అన్నాడు.

ఈమాటలు తనకేమీ బోధపడలేదు. "మీకిష్టమైతే, నాపనిలో కొంతపంచి యిస్తాను. సరేనా?", అని అడిగింది.

"పిల్లదానా! ఎంతమాట అన్నావు చివరకు! అంత కంటేనా? నీ రెక్కలకష్టం తగ్గించడానికి తయారుగా వున్నాను", అన్నాడు.

"ఏరకమైన పని కావాలో చెప్పండి", అన్నది.

"నీ కడవలలో, యిప్పుడు నీకక్కరలేనిది, ఏదైనా ఒకటి యిస్తావా?", అని అడిగాడు.

"కడవా? ఎందుకు? వాగులో నీరు నింపడానికా?", అని అడిగింది.

"అబ్బె, అందుకుకాదు, దానిమీద బొమ్మలువేసి యిస్తాను", అన్నాడు,

ఆ కుర్రది చిరాకుపడింది.

"బొమ్మలూ గిమ్మలూ! మీబోటివాళ్ళతో మాట్లాడినా కాలం వృధా అవుతుంది. నాకు తీరికలేదు. పోతున్నాను", అంటూ వెళ్ళిపోయింది.

పనేలేని మనిషిని, పని తెమలని మనిషి యెట్లా క్రిందు చేయగల్గుతుంది? ప్రతిరోజూ వాళ్ళిద్దరూ ఎదురౌతున్నారు. "పిల్లా, పిల్లా, నీ కడవ యివ్వవూ? మంచి మంచి బొమ్మలువేసి ఇస్తాను. నీ కడవ నిద్దూ?," అని ప్రతిరోజూ అడుగుతూనే వున్నాడు.

ఎట్టకేలకు ఆ కుర్రది లొంగివచ్చింది. కడవ నిచ్చింది.

అతను రంగులు వేయసాగాడు. బొమ్మలు గీయసాగాడు. రేఖ వెంబడి రేఖ, రంగు వెంబడి రంగు, గీస్తూ, వేస్తూవున్నాడు,

పని పూర్తి అయింది. ఆ కుర్రది కడవ నెత్తి పట్టిచూచింది. కళ్లు కలవరపడినవి. కనుబొమలెత్తి చూచి, "ఏమిటండీ యీ గీతలూ రంగులూ యేమిటిదంతా? ఏమిటి లాభం దీనివల్ల?, అని అడిగింది.

"శూన్యం. బొమ్మకు అర్ధమనీ, లాభమనీఒకటివుంటుందా? అది యెందుకైనా పనికివస్తుందా? పిచ్చిదానా, అవేమీలేవు. అసలు అవి అక్కరేలేదు." అన్నాడు, నవ్వి.

ఆ పిల్ల కడవపట్టుకొని వెళ్ళిపోయింది. ఇంటిలో, ఎవరూ చూడనిచోట నిలుచుని ఆ కడవను ఎండలో ఎత్తి పట్టి, తిప్పి తిప్పి, పరీక్షించి చూడసాగింది. రాత్రిపూట, పడకదిగి, దీపం వెలిగించి, మళ్ళీ పరిశీలించి చూచింది, చూడగా, చూడగా, తన కొక విషయం తెలిసింది. ఇంతకుముందు ఎప్పుడూ తా నెరుగనిది. ఏ అర్థమూ, ప్రయోజనములేని వస్తువులుకూడా వున్నవి, అనే విషయం మొట్టమొదటిసారి ఆమె తెలిసికొన్నది.

చిత్రకారుడు వాగుసద్ద నిలుచుని వున్నాడు. అతన్ని చూచింది,

"ఏమివ్వను బదులుగా, నేను ?" అని అడిగింది.

"మరింత పనిబెట్టు," అన్నాడు.

"ఎలాంటిపని ?" అని అడిగింది.

"రంగుల రంగుల రిబ్బను చేసి యివ్వనా ? నీ తల వెంద్రుకలలో పెట్టుకొందువుగాని ! ఏం ?" అన్నాడు.

"ఎందుకది ?" అని అడిగింది.

"ఊరకే." అన్నాడు.

తళతళలాడే మిలమిలలాడే రిబ్బన్లు చేసి యిచ్చాడు. పని తెమలని కార్మికుల పిల్లలకు యిప్పుడు కాలమంతా రిబ్బన్లను అమర్చుకోవడంలో సరిపోతున్నది. ఉపయోగ పెట్టుకోని నిమిషాలు గడిచిపోతున్నాయి. ఎంతో పని పూర్తికాకుండా నిలచిపోయింది.

కార్మికుల స్వర్గాన పని కొంచెమై పోసాగింది. ఇంతకు మునుపు విరగబడి పని చేసేవాళ్ళు అనేకులు యిప్పుడు సోమరిపోతులై, బొమ్మలు గీస్తూనో, రంగులు పూస్తూనో, బొమ్మలు చేస్తూనో, అమూల్యమైన కాలాన్ని అనవసరమైన దండుగపనులకు వినియోగ పెడుతున్నారు.

కులపెద్దలు కలతపడ్డారు. సమావేశం ఏర్పాటు చేశారు. కార్మిక స్వర్గాన యిలాంటి పరిస్థితి మునుపెప్పుడూ లేదని అందరూ అంగీకరించారు.

ఇంతలో దేవదూత పరుగెత్తుకొని వచ్చాడు. కుల పెద్దలకు నమస్కరించి, "అయ్యలారా ! నా బుద్ధి గడ్డితినింది. పొరపాటు చేశాను. మన్నించండి. మరొకచోటికి తీసికొనపోబోయి, పొర బాటున ఒక మనిషిని యిక్కడికి తీసికొనివచ్చి వదిలాను. మన్నించండి", అన్నాడు.

ఆ మనిషిని పిలిపించారు. ఎచ్చిపిచ్చిగా యివేమి దిరుసులూ !. ఈ కుంచెలూ, యీ రంగులూ, ఏమిటీ వాలకం ? అనుకోసాగారు. కార్మిక స్వర్గాన వుండతగనివాడని నిర్ణయించారు.

"నీబోటివారికి యిక్కడ చోటులేదు. వెంటనే యీ లోకం విడిచి వెళ్లు", అని అధ్యక్షుడు ఆజ్ఞాపించాడు.

అమ్మయ్య, బ్రతికానురా బాబూ, అన్నట్టు అతగాడు నిట్టూర్చాడు. కుంచెలనూ, రంగులనూ చేతబట్టుకొని బయలుదేర బోతున్నాడు. ఇంతలో ఆ కుర్రది, రెక్కలమీద వచ్చి వ్రాలినట్లు. వచ్చి, "ఒక నిమిషం వుండండి. మీతోబాటు నేనూ వస్తున్నాను", అన్నది.

కులపెద్దలు 'ఆ!', అని నోళ్ళుతెరచి చూచారు. ఎంతపని ఎంతపని ! కార్మికస్వర్గాన ఎప్పుడూ ఎవ్వరూ చేయని పని ! అర్థం పర్థంలేని పని ! పనికిమాలిన పని !

# దివి - భువి

[దేవ ప్రభువైన ఇంద్రుడూ, దేవ గురువైన బృహస్పతి, దేవ సేనాధిపతి కార్తికేయుడు - సమావేశమై లోక సమస్యలను గురించి మాట్లాడుకొంటున్నారు]

ఇంద్రుడు : గురుదేవా, ఒకప్పుడు రాక్షసులు మనలను స్వర్గమునుండి తరిమివేయ బూనుకొన్న విషయం తామెరుగుదురు కదా ! ఆ ఆపత్కాలమందు మానవుని సాయముతో మనము రాక్షసులను ఓడించాము. కాని అంతకంటె గొప్ప ముప్పు యిప్పుడు ఏర్పడివున్నది. ఆ విషయ మెరుగుదురా మీరు ?

బృహస్పతి : దేవ ప్రభూ ! మీరనే మాటల అర్థము నాకేమీ బోధపడడములేదు. మీరు ముప్పుమూడిన దంటున్నారు. ఏమిటది ?

ఇంద్రుడు : స్వర్గలోకము మరణించింది.

బృహస్పతి ; మరణించిందా ? అదేమిటి ? మన మంద రమూ స్వర్గంలో బ్రతికేవున్నాము కదా ?

ఇంద్రుడు : అలవాట్లనుబట్టి మాత్రమే బ్రతుకుతున్నాము. రోజురోజుకూ స్వర్గం కుంచుకొని, కుంచుకొని కృశించి నీడయై, చిట్టచివరకు నశించిపోయింది. మన మీ విషయమే గమనించలేదు,

కార్తికేయుడు: కానీ, దేవప్రభూ, మనము నేటికీ యజ్ఞ యాగాదులు యథావిధిగా చేస్తూనే వున్నాముకదా ?

ఇంద్రుడు: నిజమే. వాటిసంఖ్య,ఆడంబరము మితిమీరుతూ వున్నాయికూడా. సూర్యాస్తమయము ఎంత శోభాయమానమై కనిపిస్తుంది! దాని వెనుకనే చీకటి పేరుకొని వుంటుందికదా! అట్లాగే యిదికూడ. దేవసేనానీ, స్వర్గలోకమెంతో అవాస్తవికమై పోయింది. ఎవరైనా దాడి చేస్తారనే జడుపుకూడ పోయింది. రాక్షస దండయాత్రలు ఆగిపోయి ఎంతకాలమయిందో గుర్తుందా మీకు? వాళ్లు యెందుచేత మనమీద దండెత్తి రావడంలేదు? ఇక్కడ అనుభవించేది ఏదీ లేకపోయింది. కనుకనే వాళ్లురావడం మానుకొన్నారు. దండయాత్రల భయం మెదలుతుండినంతవరకు స్వర్గం వాస్తవమై వుంది. ఇప్పుడు మరి అవాస్తవికమై పోయిందికాబట్టి —

కార్తికేయుడు: మీ మాటలు యిప్పుడిప్పుడే బోధపడు తున్నాయి.

బృహస్పతి: కలతనిద్రనుండి లేచిన వెంటనే, కలగన్నామని తెలిసివచ్చినట్లు, మీరు వివరించిన వెంటనే, మనం భ్రమలతో బ్రతుకుతున్నామని తెలిసివచ్చింది.

కార్తికేయుడు: నాకు ఏమనిపిస్తున్నదో ఎరుగుదురా? తళతళలాడే నా యీ ఆయుధాలనూ, కవచాన్నీ చూసినప్పుడు అంతా సవ్యంగానే సరిగానే నడుస్తున్నదిలే అనిపిస్తుంది. కాని ఎవరో నా చెవిలో, కొంతసేపు నీ చుట్టూ చూసుకోవోయ్", అని హెచ్చరించినట్లుగా వుంటుంది. చూస్తాను. ఛీ! నా ఆయుధాలను ప్రయోగించేందుకు ఏ విరోధీ కనుపించడు. మనకు ఒక

గురికాని, ఒక ప్రయోజనంకాని లేనందుచేత, యీ ఆయుధాలన్నీ బరువెక్కి, గల్లంతు చేయడానికే పనికివస్తున్నవి.

బృహస్పతి : ఈ మార్పు అంతా యెట్లా వచ్చిందో తెలిసికోవాలి మనం.

ఇంద్రుడు : ఇంతకుమునుపు స్వర్గం నేలనుండి సత్తువ తెచ్చుకొనేది. ఇప్పుడు నేల స్వర్గానికే యెడమై పోయింది. ఇదే కారణం.

బృహస్పతి : ఏ నేల ?

ఇంద్రుడు : భూలోకపునేల. మునుపు. దేవతలసాయానికి మానవుడు స్వర్గానికి యెక్కి వచ్చేవాడు. అట్లాగే మానవుని విరోధులను ధ్వంసపరిచేందుకు దేవతలు భూలోకానికి దిగిపోయేవాళ్లు. చేయి చాస్తే, అందుబాటులోకి వచ్చేటంతా దగ్గరగావుండేవి భువీ, దివీ. భూలోకముతోటి నిత్య సంబంధాలు లేనిదే, దివ్యలోకం అసలు వుండడమే కష్టం.

కార్తికేయుడు : మరి, భూలోకంకూడ పతనమై శిధిలమై పోతున్నది. మానవుడు తన పరాక్రమాన్ని నమ్ముకోవడం లేదు. అన్నిటిమీద అతనికి నమ్మికపోయింది. వస్తుసంపదమీద తప్ప. స్వర్గముతో భూమిని అతికిన లంకె తెగిపోయింది. కాబట్టి, మానవుని మనస్సు యీ వస్తువుల బరువునుండి బయల్పడి, కాంతిలోకానికి యెగబ్రాకలేకుండా వున్నది.

బృహస్పతి : దీనికి ఏది విరుగుడు ?

ఇంద్రుడు : తిరిగి దివిని భువితో లంకె కలపాలి.

బృహస్పతి : కానీ, మునుపు దేవతలు భూలోకానికి దిగిపోతూ వుండిన దారి పూడిపోయింది. దాని జాడకూడ మాసిపోయింది, మంచిదే అనుకొన్నాను నేను. ఈ విధంగానైనా

ఎవరి తోడ్పాటు లేకుండానే స్వర్గం స్వయంపోషక మవుతుం దను కొన్నాను.

ఇంద్రుడు : అందరం అట్లాగే అనుకొన్నాము. కానీ, యిప్పుడు తప్పు తెలిసికొన్నాం. స్వర్గలోకం తనంత తానై నిలువ లేదని తెలిసి వచ్చింది. అమృతం తప్పత్రాగి, మన్ను మిన్ను తెలియక, సత్యాన్ని చూడకపోయాం. ఈ లోపల భూలోకానికి వుండిన బాటను యెవరూ త్రొక్కనందుచేత, అది పూర్తిగా మరుగుపడి పోయింది.

కార్తికేయుడు : రాక్షసులను ఓడించిన తర్వాత, విరోధులు చొరవీలులేనట్లుగా, స్వర్గాన్ని దుర్గమం చేశాము. స్వర్గలోకపు సంపద పెచ్చుపెరిగిపోయింది. సరిహద్దులను దాటి ఆ సంపద వినియోగపడలేదు. యుగాలు యీ విధంగా జరిగిపోయినవి. మనం పూర్తిగా కేటాగా విడిగా వుండిపోయాము. అభివృద్ధి మార్గాన అంగలువేసుకుంటూ వెళ్ళిపోయాము. కాని మనకూ, తక్కిన సృష్టికీ నడుమ అఖాతం ఒకటి ఏర్పడి, పోను పోను విస్తరించుకొని, లోతై పోయింది. కనుకనే నేడు మిత్రులే కరువై ఒంటరిగాళ్ళం కావలసి వచ్చింది.

ఇంద్రుడు : అభివృద్ధి కానివ్వండి, మరేదైనా కానివ్వండి, మిగతావాటినుంచి ఏదైతే ఒకరిని వేరుపరుస్తుందో, అదే వారిని క్షీణపరుస్తుందికూడాను. సన్న జనానికి దొడ్డవారు దూరమైపోగానే, వారి దొడ్డతనం అంతరిస్తుంది. తమ బరువుకు తామే క్రుంగి పోవలసి వస్తుంది. నేడు, స్వర్గలోక జ్యోతికీ, భూలోక దీప కాంతికీ యెలాంటి సంబంధమూ లేదు. మన దివ్యజ్యోతి కొరవి దెయ్యములాగైంది. ఇదే మనకు శిక్ష. మృత్యుబాధకంటె కఠిన మైన దండన. ఎక్కనలవిగాని గోడలను చుట్టూ కట్టుకొని,

యితర లోకాల కుళ్ళుకంపు తగులకుండా, స్వర్గలోకం తనను తాను ఆశ్రయించుకొంది. ఈ అడ్డుగోడలను చీల్చుకొని పోతే గాని మనకు నిజమైన స్వేచ్ఛ తిరిగి రాదు. అజ్ఞానులతోటి, అధః పతితులతోటి, అణగద్రొక్కబడినవారితోటి పాపపంకాన దిగబడినవారితోటీ, నిరాశామయులైన వారితోటి మనం తిరిగి సంబంధాలు కల్పించుకోవాలి.

బృహస్పతి : ఎట్లా చేద్దామంటారు ?

ఇంద్రుడు : స్వయంగా నేను భూమికి అవతరిస్తాను.

బృహస్పతి : అక్కడే వుంది చిక్కు. భూమికి వుండిన దారి మరుగుపడిపోయింది.

ఇంద్రుడు : తెలుసు. కానీ, నేను అమరుణ్ణిగా అక్కడకు మరి పోను. మానవ శిశువుగా అవతరించగలనుకదూ ? ఏదో తార మిన్నులనుండి వూడిపడి, అంతులేని స్థలావకాశాన తన కాంతిని దాచిపెట్టి, భూమికి చెందిన వస్తువైనట్లు, భూలోకాన్ని చేరుకొంటూవుంది. అట్లాగే నేనున్నూ మానవ శిశువుగా అవతరిస్తాను.

బృహస్పతి : ఓ మరు శిశువు కాగలంత దొడ్డకుటుంబాలేవి ? ప్రభూ, భూలోక మిప్పుడు దుర్దశలపాలై, వర్తకగణాల పెత్తనానికి లోబడిపోయి వుంది. మేధావులను వాళ్లు తమ దాసులనుగా చేసికొన్నారు. యుద్ధమే బ్రతుకుగా గలిగినవారి ఆయుధ బలంమీద ఆధారపడి వున్నారు.

ఇంద్రుడు : ఎక్కడ పుట్టవలెనో నేనై నేను నిర్ణయించలేను. నన్ను లోనికి ఆకర్షించగల గృహమేదైనా కానీయండి, అందులో చోటు చూచుకొంటాను.

బృహస్పతి : తాము ఇంద్రుడనని ఎట్లా మరచిపోగలరు ?

ఇంద్రుడు : నేను పూర్వ విషయాలనన్నిటినీ మరచిపోక తప్పదు. నా ప్రయాణం సఫలం కావలెనంటే. మానవునితో నాకే భేదమూ వుండకూడదు.

కార్తికేయుడు : భూలోకమనేది ఒకటి వున్నదనే విషయాన్నే నేను దాదాపు మరచిపోయాను. ఈరోజు తమమాటలవల్ల మళ్ళీ గుర్తు వచ్చింది. అహా ఎంత అందమైందోకదా ఆ లోకం! సూర్యోదయ, సూర్యాస్తమయాలు కల్పించిన దారులద్వారా, స్వర్గం వైపు ఎంతో ఆప్యాయంగా చూస్తూ వుండేది భూదేవి. యువతి! నల్లగా నిగనిగలాడుతుండేది! ఆమెను కల్లోలపరిచే భయాలను తొలగించి, గుండెలో తిరిగీ కొత్త ఆశలను ప్రవేశపెట్టడం ఎంత సంతోషకరమైన విషయం! ఆకు పచ్చని వలువలు తాల్చి. కిరీటంమీద నిలిచి వెలిగే చందమామతోటి, అందాల నొలకబోసే ఆ సుందరి దేవతలందరికీ ప్రేమాస్పదమయింది. తానా విషయాన్ని మరచిందా యేమి నేడు?

ఇంద్రుడు : తననుంచి ఎడబాటు కలిగినందుచేత, స్వర్గం బాధలతో నిట్టూర్పులు నిగుడిస్తున్నదని, భూదేవికి దక్షిణ పవనాల ద్వారా కబురు పెట్టుతాను. భూమిమీది సప్తసముద్రాలు మరేమిటి, విరహ బాధచే స్వర్గంమురిసిన కన్నీళ్లేకావా.?

కార్తికేయుడు : తమసెలవైతే మేమూ భూమికి అవతరిస్తాము.

బృహస్పతి : మృత్యువనే కటిక నల్లటి మేలిముసుగును చీల్చుకొనివెలిగే అమరజ్యోతిని కనుగొంటాము.

కార్తికేయుడు : సేవచేస్తే కలిగే సంతోషాన్ని మాకెందుకు లేకుండా చేయాలి? భూమికి నా అవసరంకూడా వున్నటుంది. నేను

అక్కడ లేనందుచేతనేకదా, మానవుడు నేడు ఆదర్శాలకొరకుగాక, సిగ్గుమాలిన ధనాశకొరకు పోట్లాడు తున్నాడు ?

బృహస్పతి : మరి, నేను లేనందుచేత నే కాదా, మానవుడు నేడు జ్ఞానం కొరకు జ్ఞానాన్ని పూజించడం మానివేసి ఏదోక్షుద్ర ప్రయోజనం కోరిదానినారాదిస్తున్నాడు ?

ఇంద్రుడు : మీరు రాగలందులకు నేను దారి చెలిగి పెట్టుతాను. సరియైనతరుణం వచ్చినప్పుడు, తొడిమవీడి రాలిపడే పండువలె. మీరు అవతరిద్దురు. కాని అందాక వేచివుండండి.

కార్తికేయుడు : తరుణం ఆ సన్న మయిందని మాకెట్లా తెలియగలదు ప్రభూ ?

బృహస్పతి : దానికేముంది ? భూమినుండి వెలువడే విజయ ఘోషలు స్వర్గంలో ప్రతిధ్వనించగానే.

ఇంద్రుడు : అది సరికాదు బృహస్పతీ ! మీకు విజయ ఘోషయే వినరాదు. నాయాత్ర సఫలమైందనేవార్త మీకు స్వర్గలోకపు గాలులు అందజేయగలవు.

కార్తికేయుడు : ఆ రోజువరకూ, తాము ఏ శరీరాన దాగి వుంటారో అది మాకు తెలిసిరాదు కాబోలు?

బృహస్పతి : భూలోక జీవులందరూ దాగుడుమూత లాడుతారు. అక్కడ సంపద బీదవేషం ధరిస్తుంది. బలహీనుల పెంపకం కింద అధికారశక్తి పెరిగి పెద్దదవుతుంది ఓటమి అనే భూమికింద గెలుపు వేళ్ళు తన్నుకొంటుంది. సాధ్యమేకాని దాని గర్భాన సాన్యమనేది జీవిస్తుంది. అక్కడ కంటికి కనిపించేదంతా నిజమనుకోవడానికి వీలులేదు. కంటికి కనుపించనిదానిని నమ్మకోవలసి వస్తుంది.

కార్తికేయుడు: సరేకాని, ప్రభూ! మీ ముఖకాంతి నేడు యింత కళావిహీనమయింది, ఎందుచేత?

బృహస్పతి: మానవునికొరకు యెత్తబోయే మీ జన్మ అద్భుతమైనది. దాని శోభ మీ ముఖమందు దివ్యతారవలె వెలుగొందాలి.

ఇంద్రుడు: బృహస్పతీ మానపజన్మ వేదనలు అప్పుడే నాలో మొదలైనవి. ఆనందమయమైన దివికీ. దుఃఖమయమైన భువికీ యెట్లాగైతేనేమి యెడబాటు కలిగింది. ఆ వుభయ లోకాలను ఒక కాలికికి తీసికొని రావలెనంటే. బాధల తుపానులగుండా పోట్లాడవలసి వుంటుంది. సెలవు. మిత్రులారా. సెలవు. బాధాకరమైన బ్రతుకుదారుల కావలనే ఆత్మకు విముక్తి కద్దు.

# నరకంలో మజిలీ

ఒకగొంతు: రాజాధిరాజా, ఎక్కడికి యిటు పోతున్నారు?

సోమకుడు: ఎవ్వరది నన్నుపిలిచేది? లోతైన కారునల్లని యీ మేఘభూమిలో నా కేదీ కానరావడంలేదు. దేవదూతా. కాస్సేపు రథాన్ని ఆపు. చూడనీ, ఎవరోగాని నన్నుపిలుస్తున్నారు.

గొంతు: దిగండి, మహారాజా, దయయుంచి దిగండి రథం!

సోమకుడు: ఎవరు మీరు? ఎక్కడినుంచి మాట్లాడుతున్నారు?

గొంతు : నేనే, మరెవర్ని ? ఋత్విక్కుణ్ణి. తమ కుల పురోహితుణ్ణి.

సోమకుడు : అయ్యా. లోకపు శోకాశ్రువులన్నీ ఆవిరులుగా మారగా, అంతులేని కటిక చీకటి గూడు కట్టుకొని యీ భయంకర ప్రదేశం ఏర్పడినట్లుంది. సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు-యివేవీ యిక్కడి ఆకాశాన్ని వెలిగించడంలేదు. పీడకల గుండెల నదిమివేసేటట్లుగా, బరువెక్కిపోయి విచారం వ్యాపించి వుంది. ఇక్కడ వున్నారేమి మీరు ?

నీడలు : భువినుండి దివికిపోయే బాటప్రక్కగావున్న యీ దుఃఖలోకమే నరకం. మేము యీ లోకపు జీవులం. స్వర్గ జ్యోతుల కొసవెలుగులు మాకు తలయెత్తిచూస్తే మందమందంగా కనిపిస్తాయి. ఆనందధామానికి యాత్రికులను కొనిపోయే రథ చక్రాల ఘోష రేయింబవళ్ళు మాకు వినిపిస్తుంది. అసూయతో మా కళ్ళు మండిపోతాయి. మరి. నిద్ర ఎట్లా వస్తుంది మాకు ? వంగి క్రిందికి చూస్తేనో, వదలిపెట్టి వచ్చిన భూలోకపు ఆకుపచ్చ గుబుర్లు కనిపిస్తాయి. సప్తసముద్రాల రొద దూరంనుంచి వినిపిస్తుంది.

ఋత్విక్కుడు : దిగండి. రాజా ! రథం దిగండి.

నీడలు : దుఃఖోప హతులం. మా ప్రార్థనలు ఆలకించండి ! మాతో ఒక గంట గడపండి చాలు. మాకు సుఖం కలిగించిన వారవుతారు. ఇంకా మీలో భూలోకజీవుల దయాదాక్షిణ్యాలు అంతరించలేదు. పచ్చికలోని కొత్తదనమూ, ఆకులలోని నునుపూ, పళ్ళలోని కమ్మదనమూ మీ ఆత్మలో కూడగట్టుకొని వున్నారు. స్నేహితులూ, సోదరులూ. మాతా సతులూ యిచ్చిన

ఆశీర్వాదాలను వెంటబెట్టుకొని వస్తున్నారు మారే ఋతువుల రక రకాల సంతోషాన్ని తీసికొని వస్తున్నారు.

సోమకుడు : అయ్యా, యీ గబ్బసీమలో చీకటి సీమలో మీరు వుంటున్నారు ఎందుచేత ?

ఋత్వికుడు : మీ కుమారుణ్ణి హోమజ్వాలలకు అర్పించాను కదా! ఆ నేరానికి తగిన శిక్ష యిదే!

నీడలు : రాజా, రాజా, ఆ కథ చెప్పరూ మాకు ? చెడు పనులను గురించి వినవలెనని యింకా మనసవుతుంటుంది మాకు. భూలోకపు సంగీత స్వరాలన్నీ, సుఃఖదుఃఖాల కంపనాలన్నీ. మీ గొంతుకలో నిలిచి వున్నాయి. ఆ మీ మానవకంఠస్వరంతోటి యీ కథను చెప్పండి, రాజా. వింటాము.

సోమకుడు : అయితే చెప్తాను పట్టండి. నేను సోమకుణ్ణి. విదేహ దేశాధీశుణ్ణి, చాలనాళ్ళవరకు బిడ్డలులేరు. లేక లేక, నా ముది వయసున, ఒక పుత్రుడు కలిగాడు. దేవతలకు, ఋషులకు, బ్రాహ్మణులకు నేను చేసిన పూజలెన్నో అన్నీ అతనిలో ఫలించినవి. పుత్రునిపట్ల వాత్సల్యమనే బంధాలకు నేను పూర్తిగా కట్టుబడిపోయాను. మిగతవి అన్నీ మరచిపోయాను. దాహంచేత శుష్కించి శోషిల్లిన నా జీవితానికి ఆ నా పుత్రుడే అమృతప్రాయమయ్యాడు. నా బ్రతుకు అనే తొడిమనంతటినీ వాడు కలువపూవువలె ఆక్రమించుకొన్నాడు. భూమిని సూర్యుడు ప్రకాశింపజేసేటట్లు, నా కన్నయ్య ముఖంమీద నా హృదయమే ప్రకాశించేది. మంచుబొట్టును తాల్చిన తామరాకువలె నేను నా చిట్టి తండ్రిని ఎంతో జాగ్రతగా కాపాడుకొంటూ వచ్చాను. నాలోని రాజధర్మమూ, రణదాహమూ అడుగంటి, పితృవాత్సల్య మతిశయించసాగింది. నేను నా విధులను, బాధ్యతలను నిర్వర్తించ

డంలో అశ్రద్ధ చూపసాగాను. ఇదిచూచి నా రాజ్యమంతా తల వంచుకొంది.

ఒకరోజున, కొలువులో, మంత్రులతో దీర్ఘాలోచనచేస్తూ వుండగా, నా కన్నయ్య ఏడ్పు వినవచ్చింది. వెంటనే సింహాసనం దిగి, అంతఃపురానికి గబగబ పోసాగాను.

ఋత్విజుడు : అదే సమయానికి, రాజపురోహితుడనైన నేను, రాజుగారిని ఆశీర్వదించిపోదామని, కొలువుకూటానికి పోతూవున్నాను. కాని రాజుగారు అంతఃపురంవైపు గబగబ వెళ్ళుతూ, తను త్వరలో, నన్ను ఒకప్రక్కకు నెట్టి, తాము వెళ్ళిపోయారు. నాలో స్వాభిమానం, పౌరుషం, కులగర్వం దెబ్బతిని, గాయపడి, భగ్గుమని ప్రజ్వరిల్లింది. కొంతసేపటికి, రాజుగారు తిరిగివచ్చి, సింహాసన మలంకరించారు. అప్పుడు ఆయనతో నేనేమన్నానంటే :

"దీవిస్తానని బ్రాహ్మణుడు ఎత్తిన చేతిని త్రోసిపారవేసి అంగలు వేసుకొంటూ పోయారే ! అంత గొప్పముప్పు యేమి వుప్పతిల్లింది ? రాజధర్మాలను విడిచిపెట్టేట్లు తమరిని నిర్బంధించిన దేమిటి ? మీరు న్యాయం కల్పిస్తారని మనవులతో, మహర్జీలతో ఎందరో వచ్చివున్నారు. మీరు ఆహ్వానించి, ఆదరిస్తారని దూర దేశాలనుండి రాయబారు లెందరో వచ్చివున్నారు. రాజ్యవిషయాలనుగురించి మీరు ఆదేశిస్తారని ఎందరో ఉద్యోగులు వేచివున్నారు. ఇందరు యిక్కడ వుండగా, యింత ముమ్మరపు పనివుండగా, ఒక పసిబిడ్డ ఏడుపు వినిపించినదే తడవుగా అందరినీ, అన్నిటినీ విడిచిపెట్టి పిచ్చెత్తినట్టు అంతఃపురానికి పరుగుదీశారు. సిగ్గుసిగ్గు, రాజా ! తమ ప్రభువుగారి హృదయదౌర్బల్యం చూచి, యిక్కడి యోధులందరూ అవమానంతో తలలుదించుకొన్నారు. ఈమీమెతక

గుండె గురించి మన విరోధులందరూ యిదివరకే తెలిసికొని, పసి వాని చేతులనే సంకెళ్ళకు లోబడిపోయిన మిమ్మ గేలిచేస్తున్నారు. కలవరపడి, దిగులుపడి మన మిత్రులు చాటుమాటుగా తమ కళ్ళ తడి తుడుచుకొంటున్నారు."

సోమకుడు : ఈ మందలింపును విని, ఆస్థానంలోని వారం దరూ నివ్వెరపడిపోయారు. మంత్రులూ, పౌరులూ, సామంతులూ, దూరదేశాగతులూ నా ముఖానికేసి ఖంగారుగా, నిశ్శబ్దంగా చూడ సాగారు. ఒక క్షణంసేపు నాలో పౌరుషం వుప్పొంగిపోయింది. కాని, ఇంతలో క్రోధమనే పామును అవమానం అణగద్రొక్కి వేసింది. పురోహితుని ఎదుట సాగిలబడి, వినయ వినమ్రతల తోటి నేనేమన్నానంటే;

"స్వామీ, నాకు వున్నది ఒక్కగా నొక్కబిడ్డ. వాని గురించి నే నెప్పుడూ చింతతో కలతపడుతున్నాను. ఏమైందో బిడ్డకు, అనే ఆందోళనలో పడి, నేను తప్పుచేశాను. తమరు క్షమించాలి, మంత్రులారా, రాయబారులారా, వినండి, తిరిగి మరెన్నడూ నా విధులను అతిక్రమించి నడువను. క్షత్రియ కుల కీర్తిని మలినపరచే పనిని దేనినీ యిక చేయను".

ఋత్విక్కుడు : కొలువు కొలువంతా సద్దుమణగి పోయింది. అందరికీ ఆనందమైంది. నేను ఒక్కణ్ణే మాట్లాడాను. దెబ్బతిన్న నాగర్వపు వేడిమి యింకా చల్లారలేదు. ఏమన్నానంటే;

"ఒక్కగా నొక్కబిడ్డ కనుక తప్పుచేశామంటున్నారు. ఏకైక పుత్రుడనే శాపంనుండి బయల్పడగోరుతున్నారా? అనేక పుత్రులను పొందవలెనంటే దానికొక మార్గం వుంది. కాని అది కఠినమైనది. మీరు దానికి మోటుకోలేరని నా భయం".

ఇది విని, రాజు నా కిట్లా బదులు చెప్పాడు.

"క్షత్రియుడనేవాడు చేయజాలని పని అంటూ ఏదీ యిలలో లేదు మీ పాదసాక్షిగా, తిరుగులేని శపథం పట్టుతున్నాను".

నేను మందహాసంచేసి, గొంతెత్తి, "అయితే వినండి, రాజా! ఒక మహా హోమజ్వాలను వెలిగిస్తాను నేను. అగ్నిహోత్రుడికి మీరు మీ కుమారుని అర్పించాలి. మంటలపాలై కాలిపోయిన ఆ బిడ్డ దేహపు పవిత్రవాసనలను మీ రాణులందరూ పీల్చుకోవాలి. అట్లయితే, వాళ్ళు వెంటనే చూలుదాల్చి, నూర్గురు కొడుకులను కంటారు. ఇదే నా ఆజ్ఞ!"

రాజు తల వ్రేలవేశాడు. నిరుత్తరుడయ్యాడు. కొలువు కొలువంతా దద్దరిల్లిపోయింది. "సిగ్గు సిగ్గు బ్రాహ్మణా! ఎంత పాపిష్టి సూచన చేశావయ్యా". అని అరువనివాడు లేడు.

ఎట్టకేలకు రాజు తలయెత్తి, తొణుకుబాటే లేని గొంతుతో ఏమన్నాడంటే,

"స్వామీ! అట్లాగే కానీయండి. క్షత్రియుడు ఆడితప్పడు".

అంతఃపుర స్త్రీలు కన్నీరు మున్నీరుగా యేడ్చారు. ఆ ఏడుపులు భవంతిలో అంతటా మారుమ్రోగిపోయినవి, నగర వీధులలో ఎక్కడ చూచినా అధిక్షేపణలే. సేనలు పితూరీకి తయారైనవి. కాని రాజు మనసు రాయిచేసకొన్నాడు.

హోమజ్వాల వెలిగించాను. కాని కొలువు ఖాళీ అయింది. అంతఃపురంనుండి రాజకుమారుణ్ణి తీసికొని వచ్చేవారు ఒక్కరూ కానరాలేదు. రక్షకభటులు ఆజ్ఞలను తృణీకరించారు. సేవకులు మూగపోయి, నిలిచినచోటునుండి కదలలేదు. సైనికులు ఆయుధాలను విసరివేసి, తమ తమ యిళ్ళకు వెళ్ళిపోయారు.

రాజపురోహితుణ్ణి. వేదవేదాంత పారంగతుణ్ణి. సంసార మాయాబంధాలనుండి బయల్పడినవాణ్ణి, మానవులకుమనసుమెత్తన

రోగనమానమని నమ్మినవాణ్ణి. నేను కంపించని పాదాలతో అంగలు వేసికొంటూ అంతఃపురం ప్రవేశించాను. భయవిహ్వాలలైన రాణి పత్నులు పిల్లవానిచుట్టూ మూగి, తమ దేహాలనేదాళ్ళను అడ్డుపెట్టి కాపాడుతున్నారు, అది చూడగా నాకు, అపురూపమయిన పుష్పాన్ని పదిలంగా రక్షించే మహా వృక్షశాఖలు గురుకువచ్చాయి నన్నుచూచి, రాజకుమారుడు కిలకిల నవ్వి, చేతులు చాచాడు. చిన్నారి మోమున చిరునవ్వు చెలువొందుతూ వుంది. "నన్ను తీసికొని పో! నా చెరసాల గోడలు పడగొట్టి నన్ను హాయిగా పిడిచిపెట్టు" అని ఆ బిడ్డ అంటున్నట్లు అనిపించింది నాకు. ఊపిరి ఆడకుండా చుట్టూమూగి, అతన్ని విసిగిస్తున్నారు రాణులు. తుర్రుమని ఎగిరిపోతే బాగుండుననిపించింది ఆ బుడతనికి.

మాటలలో వెలిబుచ్చని యీ కోరికకు జవాబుగా, నేను "నాతో రా. పోదాం. నిన్ను కట్టివేసిన ప్రేమపాశాలను కోసి వేస్తాను. నీకు విముక్తిని కల్పిస్తాను" అన్నాను నేను. ఆ స్త్రీ జనాన్ని ఒకవైపుకు నెట్టి, పసివాని మీదపడి, కన్నతల్లి బాహుబంధాల నుండి అతనిని ఒడిసి పట్టుకొన్నాను. అతనిని రక్షించబూనుకొని లేచిన చేతులనన్నిటినీ దింపించాను. వ్యాకులపడిన స్త్రీలు నా కాళ్ళ మీద పడి, ప్రార్థనాపూర్వకంగా వాటిని గట్టిగా పట్టుకొని నా దారికి అడ్డువచ్చారు కాని, నేను వాటిని తొలగించుకొని, క్షత్రవాణ్ణి వెంటబెట్టుకొని వచ్చేస్తుంటే, ఘోరమైన ఏడ్పులు నా వెన్నంటి వచ్చాయి.

హోమాగ్ని ప్రజ్వరిల్లుతూ వుంది. దాని ప్రక్కన శిలా విగ్రహంవలె వున్నాడు రాజు. పిల్లవాడు ఉల్లాసంతోటి కిలకిల నవ్వుతూ, అద్భుతము గొల్పుతూ ఆకర్షిస్తూ వున్న మంటలవైపు నడిచాడు. అతన్ని నేను గట్టిగా అదిమి పట్టుకొన్నాను.

వందలాది గొంతులనుండి అంతఃపురంలో వెలువడిన బాధాకుల విలాపము మిన్నుముట్టుతూ వుంది. వీధులవెంబడి పడి, బ్రాహ్మణులు నన్ను శపించి నగరం విడచిపెట్టి పోతున్నారు. కని, విని యెరుగనంతటి ఘోరాపరాధానికి ఒడిగట్టిందని కాబోలు, వాళ్ళు యీ నగరాన్ని విడిచిపెట్టారు. కాని, నేను చెక్కు చెదర లేదు. రాజువైపు తిరిగి ఏమన్నానంటే;

"రాజా! ఇదుగో నీ బిడ్డ. నీ చేతులతో యితని నెత్తి, అగ్నిదేవునికి అర్పించు. నేను మంత్రం పఠిస్తాను."

సోమకుడు: ఆపు! మరి మాట్లాడకు!

నీడలు: ఛీ, ఛీ! ఆపు! మేమూ మానవజీవితాలలో పలు విధాల దుష్కార్యాలు చేసిన వాళ్ళమే. కానీ, ఋత్వికుడా - నీవు మమ్మందరినీ పనికి మాలిపించగల మహాపాపివి. నీకోసం ప్రత్యే కించి మరొక నరకం వుంటే బాగుండేది. నితో కలిసి మెలిసి తిరగగలంతటి సమాన పాపి యిక్కడ మాలో ఎవరూ లేరు.

దేవదూత: రాజా, ఎందుకీ నరకాన నిలిచి. పాపాత్ములు పడుతున్న యాతనలన్నీ పడుతావు? రథమెక్కు, వెళ్ళిపోదాం. బాధాకరమైన గతకాలాన్ని తిరిగి గుర్తుకు తెచ్చుకోకు.

సోమకుడు: దేవదూతా, నీ రథాన్ని తిప్పుకొనిపోవయ్యా! నేను రానయ్యా స్వర్గానికి! ఈ దురదృష్టవంతుడైన బ్రాహ్మణు నితో బాటుగా నాకుకూడా యిదే తగినచోటు. క్షత్రియ అహం కారముతో కైపెక్కిపోయి. కీర్తిప్రతిష్ఠలనుకోరి కన్న తండ్రినై కూడా నేను నా కన్నయ్యను మంటలపాలు చేశానే! నాది మెతక గుండెయని నిందిస్తున్నవారి నోళ్ళుమూసి, నా హృదయ వజ్ర కాఠిన్యాన్ని లోకానికి ప్రదర్శిద్దామని, కరుణనూ, రాజధర్మాన్నీ, పితృవాత్సల్యాన్నీ మంటలలో బుగ్గి చేసుకొన్నానే! నాడు

మొదలు చేసికొని నేటివరకూ లోలోపల కుమిలి కుమిలిపోయాను. ప్రతిరోజూ, ప్రతిగంటా. ప్రతిక్షణమూ హృదయాగ్నిజ్వాలలకు తపించి తపించిపోయాను. మానవ శరీరంనుండి బయటపడిన తర్వాత యిప్పుడుకూడా, నాయీ పాడుమనస్సు మండిపోతున్నట్లు వుంది.

కల్లకపటాలు ఎరుగనివాడు. కల్మషం అంటనివాడు. మాయమర్మాలు తెలియనివాడు. సుకుమారుడు. నన్ను ప్రేమించే వాడు, నేను ప్రేమించినవాడు నా బిడ్డ. ఒక్కగా నొక్కడు. లేకలేక కలిగినవాడే. నేనేదో ఆటబొమ్మ నిస్తున్నాననుకొన్నాడు కాబోలు, నన్ను నమ్మి కణకణలాడే మంటను చేతులు చాచి ముట్టుకొన్నాడుకదా! మంటల నడుమబడి, ఉన్నట్టుండి వెరగు పడిపోయినాడు. కళవళ పడిపోయింది ముఖం. మెలికలు తిరిగి పోయింది ఒళ్ళు. నన్ను చూచాడు. అబ్బ! ఆ చూపు! ఎంత నిందాగర్భితంగా చూచాడు నా తండ్రి! పాపిని! నరకజ్వాల నా హృదయజ్వాలకంటె ఎక్కువేమీ కాదు. స్వర్గంలో నాకా స్థానం? దేవతలు పొరబడ్డారేమో! నా పాపాన్ని మరచిపోయి వుంటారు. దేవతలు మరచినా, నేను మరువగలనా? నా కన్న తండ్రి నిప్పును తాకి శూలాలవంటి చూపులతో నా గుండెను కోసిన చూపు నేనెన్నటికైనా మరువగలనా? రేయింబగళ్లు, నిరంతరాయంగా, యీ నరకయాతనల పాలై పోతాను. అప్పటికీ నా పాపానికి తగినశిక్ష పూర్తికాదు.

(ధర్మదేవత ప్రవేశిస్తాడు)

ధర్మము: రాజా, స్వర్గం నీ కొరకు కాచుకొనివుంది. ఇక మరి జాగుచేయకు.

సోమకుడు : దేవా, కడుపున కన్న బిడ్డను చంపుకొన్న వానికి అది కాదయ్యా స్థానం.

ధర్మము : భూలోకములోనే నీవు నరకాన్ని అనుభవించినావు. నీ పాప మక్కడే అంతరించింది. హృదయంలో ప్రజ్వరిల్లిన చింతాగ్నిజ్వాలల్లో నీ పాపం భస్మీభూతమైపోయింది. దుష్టజ్ఞాన గర్వాన, వాత్సల్యమనే గూటినుంచి పసిబిడ్డను లాగి పట్టుకొని. నాశనం చేసి కూడా పశ్చాత్తాపపడని యీ బ్రాహ్మణునికే యిది తగిన చోటు.

ఋత్విజుడు : పోబోకు. రాజా, పోబోకు. ఇప్పటికే ఎన్నో చింతలతో పరితపించిపోతున్నాను. వాటికి తోడు, అసూయను కూడ చేర్చకు. నీ వొక్కడవే స్వర్గానికి పోతే. నాకు మరొక నరకం సృష్టించిన వాడవౌతావు. ఈ నరకయాతనకంటె అది యిబ్బడిగా వుంటుంది.

సోమకుడు : దౌర్భాగ్యుడా. నీతోనే వుంటాను. ఇద్దరం కలిసి. నరక జ్వాలలకు ఆత్మ బలిదానం చేద్దాము. ధర్మదేవా, యీ వరాన్ని నాకు ప్రసాదించండి. ఈ ఋత్విజుని పాపం నివారణ అయ్యేవరకు, నన్ను యిక్కడే యితనితోబాటు మననివ్వండి.

ధర్మము : తథాస్తు. ఆత్మ శోభావై భవముతోటి మనెదవు గాక ! దుస్సహయాతనలనుండి నీ ముఖవర్చస్సు నిన్ను కాపాడుతుంది. నరకాగ్ని నీకు హేమసింహాసన మవుతుంది.

నీడలు : పుణ్యఫలాన్ని పరిత్యజించినావు. రాజాధిరాజా, నీవు మహానుభావుడవు. నరకాన పాపాత్ముడు కానివాడవు నీవే ! నీ మహాత్యాగశక్తివలన, సహవాసులమైన యీ పాపాత్ముల గుండెలలో పుణ్యాగ్నిని వెలిగించవయ్యా ! నరకమే అంతరించేటట్లు, నరకానికే ముక్తిప్రాప్తించేటట్లు చేయవయ్యా ! నీకు ప్రబల

విరోధియైన యీ అధమాధమపాపికి నీ చేయి అందించి. అతని దౌర్భాగ్యమందు వంతుపుచ్చుకో, నామరూపాలులేని నరకయాతన అగ్నిపర్వత శిఖరం వంటిది. మంటలు కక్కే యీ శిఖరాన, దుష్టమేఘం మీద సూర్యరశ్మివలె. మీ యిద్దరు మూర్తులూ నిలిచి, జాజ్వల్యమానమైన కీర్తిగా, ఘోరాతి ఘోరమైన అపకీర్తిగా, ఎల్లకాలం ప్రకాశించునుగాక !

# బాట

ఎందరివో కాళ్లు నలగద్రొక్కిన బాట యిది. అడవిగుండా పోయి, బయలును చేరుకొంటుంది. బయలుగుండా పోయి నది గట్టును చేరుకొంటుంది, ప్రవాహానికి అద్దరిని తిరిగి మొదలై, ప్రాకిప్రాకి, కునికిపాట్లు పడే ఒక గ్రామాన్ని ప్రవేశిస్తుంది. పసిమి వన్నెకు తిరిగిన ధాన్యపు పొలాలగుండా, మామిడితోపు నీడల గుండా నడిచి, మడుగుచుట్టూ తిరిగి, అవూరి పోరంబోకులలో అంగలు చాచి నడుస్తుంది. ఆ పిదప దూరాన కనిపించే గగన రేఖవద్ద అది ఏదో స్థలముతో కలిసిపోతుంది. ఆ స్థలం పేరేమిటో నాకు తెలియదు.

ఈ బాటలో నాకంటె ముందుగా స్త్రీ పురుషులు కొందరు వెళ్ళిపోతున్నారు. వారిలో కొందరు నా సహచరులయ్యారు. మరి కొందరు వెనుకబడిపోయారు, కొద్దిమంది ముసుగు వేసుకొని, యిక కొద్దిమంది ముఖంమీద కప్పు లేకుండా వున్నారు. కడవలతు నీళ్ల నింపుకొని కొందరు తిరిగి వస్తున్నారు.

ప్రొద్దుక్రుంకింది. గప్పర గప్పర చీకటి మొదలైంది. కొంచెంసేపు ముందేమో యీ బాట నా ఒక్కడిదే ననిపించింది. కాని యిప్పుడు, నేనీబాటలో ఒక్కసారిమట్టుకే నడిచిపోతానేమో ననిపిస్తున్నది.

ఇది ముందుకుపోయే దారిమాత్రమే; వెనకకు పోయేది కాదు. మామిడితోపు మీదుగా మడుగు అంచున, నది యిసకలలో, గోశాల పక్కగా, వెనుకకు మళ్ళీ నడిచి, నా కెప్పటినుంచో పరిచితమైన చోటుచేరుకొని, "ఇదిగో. తిరిగి వచ్చేశాను", అని ఒక్కసారైనా అనేవీలులేదు.

ఈ గోధుమవన్నె సాయంకాంతిలో. కాస్సేపు వెను దిరిగి చూస్తాను. మరి ఎందరితోనో కలిసి నడిచిన యీ త్రోవ, మాసి పోయిన కాలి గుర్తులలయతో కల్పించిన గీతంవలె వుంటుంది.

తిరుగుబోతులు వచ్చారు, పోయారు. ప్రతి ఒక్కని జీవిత కథ యీ బాటమీద ముద్రింపబడి, దుమ్ముమీది కాలిగుర్తువలె తారట్లాడుతూ వుంటుంది. ఇటువంటి గుర్తులు యీ కొననుండి ఆ కొనవరకు, తూర్పుదిక్కున వున్న బంగరుద్వారాలవద్ద నుంచి పడమటి దిక్కునవున్న బంగరు దర్వాజాల వరకు, విస్తరించు కొని వుంటాయి.

"బాటా, ఓ బాటా! ఎందరో నలగద్రొక్కిన బాటా! దుమ్ము రేగే నీ నిశ్శబ్దమందు అనేకయుగాల కథను దాచిపెట్టుకోకే!

నీ గుండెకడ నా చెవిపెట్టి వున్నాను - గుసగుసలాడి నీవు నాకు ఆ కథనంతా చెప్పవూ?", అని అడుగుతాను.

కాని బాట బదులు మాట్లాడదు. నల్లటి రాత్రి తెరకేసి చూపిస్తుంది.

"బాటా, ఓ బాటా! ఎందరో నలగద్రొక్కిన బాటా! నీ మీద తిరుగాడినవాళ్లు లెక్కకు మించిపోయారు. వాళ్ళ ఆలోచనలూ కోరికలూ లెక్కకు మించి పోయినవి. అవి అన్నీ ఏమైపోయాయి?", అని అడుగుతాను,

బాట మౌనవ్రతాన్ని విడిచిపెట్టదు. ప్రొద్దుపొడిచే దిక్కునూ ప్రొద్దుక్రుంకే దిక్కునూ చూపిస్తుంది.

"బాటా, ఓ బాటా! ఎందరో నలగద్రొక్కిన బాటా! ఒకప్పుడు నీ యెదమీద పూలజల్లువలె పడిన పాదాలు ఇంకా వున్నాయా?" అని అడుగుతాను.

తన తుదిని తా నెరుగునా యీ బాట? వాడిన పూలూ, నడిచేయని రాగాలూ ఏ చోటు చేరుకొన్నాయో, చావనే చావని బాధ యెక్కడ నక్షత్రకాంతినుండి నక్షత్రకాంతివరకు నోరు విచ్చుకొంటుందో, ఆ చోటు తెలుసునా యీ బాటకు?

# మసక వెలుగు

కిటికీకి అమర్చివున్న అద్దంగుండా చూస్తే, పక్కయింటిలో ప్రతిదీ కనుపించేది. ఆయింటి జీవితచిత్రం పూర్తిఅయినదికాదు. రేఖలు రేఖలుగా, చుక్కల్లా చుక్కలుగా సగంపట్టుకేవేసి, సగం వూహకు వదలిపెట్టిన చిత్రం.

పుస్తకాలను చదువుకొంటూ చదువుకొంటూ, వనమాలి ఒకరోజున కళ్ళెత్తి కిటికీగుండా చూచాడు. చూచి చూచి పాతబడిపోయిన ఆయింటి చిత్రఫలకం మీద రెండు కొత్త ఆకృతులు కనిపించాయి యీ రోజు. ఒకస్త్రీయేమో ముసలిది. రెండవస్త్రీ పసిది. ఇరవై ఏళ్ళలోపు వయసు వుంటుంది.

కిటికీ దగ్గర కూర్చుని, ఆ ముసలిది పసిదానితల దువ్వుతున్నది. మోటుప్రేళ్ళను ప్రయోగించి, పిల్లదాని కళ్ళమ్మట నీళ్లు తెప్పిస్తున్నది.

మరొకరోజున. ఆపిల్ల ఒంటరిగా కనిపించింది. అప్పుడు సంజె చీకటి వ్యాపిస్తూవుంది. మసక మసక వెలుగులో, కళ్ళు నొప్పిపుట్టేటట్లు, ఏదో ఛాయాచిత్రపటపు అద్దాన్ని శుభ్రపరుస్తూ వుంది.

కిటికీ అద్దంగుండా, వనమాలికి రోజూ ఆ పిల్ల చేసే పనులన్నీ కనిపించేవి. వక్కాలు పొడి చేసేది. పాతబడిపోయిన మేజోళ్లను కుట్టేది. స్నానంచేసివచ్చి తల వెంట్రుకలను ఆరబెట్టుకొనేది.

దుప్పట్లూ కంబళ్లూ తెచ్చి ఆరవేసేది.

మధ్యాహ్నమయ్యేసరికి, మగవాళ్లు యిల్లు వదలి వెళ్ళిపోయేవాళ్లు. ఆడవాళ్లు కునుకుతీసేవాళ్లు. లేకుంటే పేక ఆడేవాళ్లు. కప్పుమీది తెల్లటి పావురా పిట్టలు కూడా కాస్సేపు కునికిపాట్లు పడేవి.

ఒకొ్కక్కప్పుడు ఆ చిన్నది బాల్కనీలో కూర్చుని, ఒడిలోని పుస్తకాన్ని చదువుకొంటూ వుంటుంది. వేరొకప్పుడు పుస్తకం మీద కాగితాన్ని పరచి జాబు వ్రాసుకొంటూ వుంటుంది. వదులు ముడివేసి కొన్నందుచేత, వెంట్రుకలు గాలిలో ఎగురుతూ పడుతూ

వుండేవి. తన పసిగుండెలోని మర్మాలను కాగితానికి గుసగుసమని వూదుతున్నట్లుగా ఆమె వ్రేళ్లు దానిమీద నెమ్మదిగా మెల్లగా కదులుతూ వుండేవి.

ఒక రోజున కొంచెం వ్రాసి, కలంతోటి కాస్సేపు ఆడుకొన సాగింది. చేపట్టు గోడమీద వ్రాలి కూర్చుని, మామిడి టెంకను పెరికి తింటున్నది కాకి.

ఇంతలో ఒక కారుమబ్బు మెల్లగా మునికాళ్ళమీద నడచి వచ్చి కలలు గంటూవున్న శశిరేఖను మరుగుచేసినట్లయింది. నడి వయసులోని స్త్రీ ఒకతె లోపలికి వచ్చింది. తలమీద వెంట్రుకలు పలచబడిపోయి, నొసట గాటమయినగీతలు యేర్పడి వున్నాయి. ఆమె వచ్చి, పూర్తిచేయని జాబుని లాక్కొని పోయింది.

ఆ పిల్ల బాల్కనీవద్దకు రావటం మానివేసింది, పగటి పూటా, రాత్రిపూటా, బిగ్గరగా అరుపులు వినవచ్చేవి. ఏదో గాలి వాన ఆ యింటిని ముక్కలు ముక్కలయ్యేటట్లు కూల్చివేయ బోతున్నదా, అనిపించేది.

ఒకనాటి సాయంత్రం వనమాలికి తిరిగీ ఆపిల్ల దర్శనం లభించింది. బాల్కనీలో నిలుచుని, గుడిగంటల మ్రోతను వింటు న్నది. చాలసేపయిన పిమ్మట, మోకాళ్ళమీదపడి, ప్రార్ధన మొదలు పెట్టింది. తర్వాతలేచి, వెళ్ళిపోయింది.

ఆ యువతికి లేఖవ్రాసి, వనమాలి దానిని రాత్రిపూట టపా చేశాడు. చేశాడేకాని, జాబు అమెకు చేరకుంటే బాగుండునని దేవుని ప్రార్థించ సాగాడు. తెల్లవారిన తర్వాత, కిటికీ అద్దం గుండా చూచేందుకు కూడ అతనికి ధైర్యం లేకపోయింది.

ఆ రోజే అతను నగరాన్ని విడిచి వెళ్ళిపోయాడు. ఎక్కడికి పోయాడో ఎవరికీ తెలియదు. శెలవులతర్వాత కళాశాల తెరిచారు. అతను తిరిగి రాకతప్పలేదు. కిటికీగుండా ఆ యింటి వైపు చూచాడు. అది అంటే ఎంత యిష్టమో. అంత భయం కూడా. ఒకచూపులోనే తెలిసివచ్చింది, ఆయింటిలోని వాళ్ళందరూ వెళ్లిపోయారని.

తనబల్ల మీద పడివున్న జాబులలో ఒకదానిదస్తూరీ ఎవరిదో తనకు తెలియనివారిది. పైగా స్త్రీ చేతి వ్రాతలాగుంది. టపా గుర్తుబట్టి, యీ యింటి చుట్టు ప్రక్కలనుంచే వచ్చిందని తెలిసింది.

చాలాసేపు వనమాలి ఆ జాబును విప్పకుండానే ఆలోచించాడు. వెలుతురు కెదురుగా దానిని యెత్తిపట్టి చూచాడు. పైకవరు పలచనిది. అందుచేత, లోపలి నల్లగీతలు కనిపిస్తున్నవి. తన కిటికీ అద్దంగుండా మునుపు తనకు కనిపిస్తూ వచ్చిన చిత్రంవలె యీ వ్రాత కూడా గజిబిజిగా అస్పష్టంగా వుంది.

చించి చూద్దామని అనుకొన్నాడు. కాని మనసు మార్చుకొని, ఒకపెట్టెలోపెట్టి తాళం వేశాడు వనమాలి. "ఎన్నటికీ దీనిని విప్పకుండానే వుంచుతాను," అని తనలో తాను శపథం తీశాడు.

# రాహువు ప్రణయం

(రాహువు రాక్షసుడు. జాబిలిని భయంకరంగా కామించాడు. ఆమెను రేయింబగళ్లూ వెన్నాడు తుంటాడు. ఏడాదికొకతూరి నిస్సత్తువతో జబిలి అతనికి పూర్తిగా లొంగిపోతుంది.)

నన్ను ఏవగించుకొంటావు. అయితేనేమి? నీవు నాబ దీపి నీవట్టి చేతులచుట్టూ కామమనే సంకెలను నేను తగిలించాను దాని గలగల ధ్వని కలకాలం వినవస్తుంది.

రేయికానీ, పగలుకానీ, ఎక్కడికి పోయినాగాని, నిన్ను నీడవలె వెన్నాడివస్తాను. నన్ను తప్పించుకొనిపోలేవు.

అసలే నల్లని మోమునాది. మనసులోని దిగులుచేత కటిక నల్లనై పోయింది. దానిని ఎప్పటికీ నీవు దర్శిస్తూ వుండవలసిందే నా శ్వాసతో నీ అవయవాలను తపింపజేస్తాను. ఢంకామీది దెబ్బల వంటి యీ నా హృదయ స్పందనలక్రింద, త్రొక్కుడుపడి భయా నికి నీ పాలిళ్లు గజగజలాడి, కుంచుకొని కుదించుకొని పోతాయి

రాత్రి లోలోతులలో, బరువెక్కిన మనసు కనుక నిదుర రాక, కలవరపడి కంపమెత్తి కూర్చుని వుంటావు తుష్టియేలేని దాహాన, నీముఖ సౌందర్యాన్ని త్రాగుతూవుండే నా కళ్ళను కను గొంటావు. ఇంతలో చూపులు మార్చి, మిన్నులకేసి చూస్తావు. మబ్బులమీద నలనల్లగా గీయబడివున్న పాలిన నా ముఖం నీకు కనిపిస్తుంది. పరమ వికారమైన పీడకలవలె నిన్ను వేధించి, బాధించి, అంటిపెట్టుకొని కనిపిస్తూంటాను. పస్తులతోమాడిన బిచ్చ గాని అస్థిపంజరంవలె, నీ ముందు నిలుచుని, గిరగిర తిరిగే కన్నీళ్ళతో బిచ్చమడుగుతాను. పిశాచాలవలె మన మిద్దరం కలిసి ఎడతెగని రాత్రిని వెళ్ళబుచ్చుదాము.

జల ప్రళయం వుప్పతిల్లి లోకాలన్నీ మాయమైతే, వుల్లోల కల్లోలమైన సముద్ర మధ్యాన నీవూ నేనూ మట్టుకే జత కలిసి నట్లుగావుంది. నా బాహు బంధంనుండి తప్పించుకొని పోజూస్తావు నీవు, కాని నేను నిన్ను మరింత అదిమి అదిమి పట్టుకొంటాను.

నా ఆకలి ఆకాశం వంటిది. యుగయుగాలు గడిచినా, అది అణువంతకూడ తగ్గిపోదు.

బ్రతుకు వెనుకనే చావు. ఆశ వెనుకనే భీతి వున్నవి ప్రణయినివలె. పగలు గడచిన వెంటనే రేయిబయలుదేరుతుంది నీడలేని జ్యోతియేదీలేదు. ఇదే ప్రకృతి ధర్మమై వున్నది సౌందర్యం వెనుకనే రాహువు కలకాలం వెన్నంటి పోతుంటాడు.

## ప్రాణమూ, మనస్సు

నా కిటికీ ప్రక్కనుంచి ఎఱ్రటిబాట ఒకటి పోతుంది. బళ్ళు కిరకిరలాడుతూ, బరువులను మోసికొని పోతుంటాయి. పల్లెటూరి కుఱ్ఱ పిల్లలు ఏవేవో మోసికొని వస్తారు. బజారులో అమ్ముకొని, సాయంకాలానికి వుత్తిచేతులతో, ముసిముసి నవ్వులతో మరలి పోతుంటారు. కాని, స్త్రీ పురుషులు పోయే యీ త్రోవను విడిచి నామనస్సు ఎంతో దూరమై పోతుంది.

ఒకదానితో వేరొకటి విరోధించే ఆలోచనలు చెదరగొట్టిన జీవితభాగం, ఒకదానితో మరొకటి ఘర్షణపడే ప్రయత్నాలు చీల్చివేసిన జీవితభాగం ఇప్పుడు తెరచాటుగా పోయింది. నేడు దేహం జబ్బుపడగా, మనస్సులో కోరికలన్నీ అంతరించాయి.

సముద్రాన వువ్వెత్తుగాలేచే అలల ఆగ భోగాలను చూచి, నీటిలో లోతులలో నున్న గట్టి భూమి విషయం మనము తరచుగా

మరచి పోతుంటాము. కాని యీ అలలు క్షణకాలం అగినప్పుడు, సముద్రాన మనకు కనుపించే భాగానికీ, కనుపించని భాగానికీ, వుపరితలానికీ లోలోతులకూ నడుమ ఐక్యత బయలుపడుతుంది.

జీవితముకూడ సముద్రము వంటిది. నా జీవిత ఉపరితలపు రొదలన్నీ సద్దు మణగిపోయిన వెంటనే, నేను లోలోతులు తరచితరచి చూడ గల్గుతాను. ఈ లోతులక్రిందనే, సర్వప్రపంచానికి ఆధారమైన గట్టిభూమి తగులుతుంది.

నేను తిరుగుబోతునై వుండినంతకాలం, దారిప్రక్క చెట్లును పరీక్షగా చూచే అవకాశమే .లేకపోయింది. నేడు, పరుగురు పోయే త్రోవను విడచిపెట్టాను. కాబట్టి దానితో యిష్టాగోష్ఠి చేయ గలిగాను.

ఆ మఱ్ఱిచెట్టు నా ముఖానికేసి చూచి చూచి, హఠాత్తుగా కలవరపడింది. "బోధపరచుకోలేదూ నీవు?" అని నన్ను అడుగు తున్నట్లుగా వుంది.

"నేను అంతా బోధపరచుకొన్నానులే, నీవు విచారపడకు" అని నేను దాని బాధను ఓదార్చ ప్రయత్నించాను.

కొంతసేపు అది నెమ్మదిగా వుండింది. కాని యింతలో తిరిగి కలవరపడి, ఆకులను కదిలిస్తూ మెదిలిస్తూ వణుకుతూ గల గల మనిపించసాగింది.

"అవునవును, నేను నీ చెలికాణ్ణి. లక్షలాది ఏళ్ళుగా, భూలోకమనే క్రీడారంగాన, నీతో కలిసినేను సూర్యరశ్మిని దోసిళ్ళతో పట్టి త్రాగాను. భూదేవి పాలిళ్ళనుండి పొంగెత్తిన పాలవంటి జీవ ప్రవాహాన్ని నీతో కలసి నేను జుర్రాను" అంటూ ఆ వట వృక్షాన్ని సముదాయించాను.

ఇది వినిందేమో, ఆ చెట్టు తిరిగీ గాలిగొంతుకతో, "అవును, అవును, అవును," అని ముమ్మారులు పలికింది.

నా ఒంటిలో నెత్తురు నలుదిక్కులకు ప్రసరించేటప్పుడు నా గుండెలో టకటకలాడే శబ్దంలాంటిదే యీ గాలిగొంతు. సడీ చప్పుడూ లేకుండానే, చీకటివెనుక వెలుగూ, వెలుగువెనుక చీకటీ పరిభ్రమించేటప్పుడు జనించే శబ్దంవంటిదే యీ ఆకుల గలగల శబ్దం. నిఖిల ప్రపంచమూ మాట్లాడుకొనే భాష యిదే. "నేను జీవిస్తున్నాను. మనం జీవిస్తున్నాము."

ఈ వార్తలో ఎంతో సంతోషం యిమిడివుంది. ఈ సంతోష స్పర్శకు మహావిశ్వంలోని ప్రతి అణువు పులకరించి పోతుంది.

ఇప్పుడు మర్రిచెట్టుతో నేను ఆ భాషలోనే మాట్లాడుతున్నాను. ఆసంతోషాన్నే పంచుకొని అనుభవిస్తున్నాను.

"నీవు జీవించి వున్నావా ?" అని ఆ చెట్టు నన్ను అడుగుతుంది.

"జీవించేవున్నాను నేను, నేస్తు!" అని నేను బదులు చెప్పుతాను.

అసలు యీ చెట్టుతో నాకు చెలిమి కలిసింది వసంత కాలంలో. అప్పుడు దీని ఆకులు మెత్తగా, నున్నగా, పచ్చగా మిలమిల లాడుతూ వుండేవి.

ఎండ వాటిగుండాదూరి, పచ్చికను చేరుకొనేది. నేలమీది నీడలతో నేస్తం కలిపేది.

అంతలో తొలకరులు మొదలైనవి. పైన వచ్చేపోయే మబ్బులతో బాటు, ఆకులు ముదిరి పోసాగినవి. ముదిరిముదిరి, నేడు అవి పక్వమైన ముసలివారి బుద్ధివలె, దట్టపడిపోయినవి. మరి యిప్పుడు ఎండ వాటిగుండా దూరిపోలేదు. ఒకానొకప్పుడు యీ

చెట్టు నిరుపేదల యింటబుట్టిన పిల్లవలె వుండేది. కాని, నేడో, ఒళ్ళంతా నగలతో బరువెక్కిన శ్రీమంతుని యిల్లాలువలె వుంది. వేనవేల పచ్చలను అలలుఅలలుగా వూపుతూ. "ఇటుకలూ, గచ్చూ చేసిన బందిఖానాలో అణగి మణగి పోతావేల? నావలె అరుబయటకు రాకూడదూ, నీవు?" అని అంటుంది.

"కారణం లేకపోలేదు, మానవులం మేము. చిత్రమైన జీవులం. రెండు ప్రపంచాలను గురించి మేము శ్రద్ధ చూపవలసి వుంటుంది. ఒకటి లోపలి ప్రపంచం, రెండవది వెలుపలి ప్రపంచం" అన్నాను నేను.

"నిజంగానా? అయితే లోపలి ప్రపంచం ఎక్కడ వుంది.?" అని అడిగింది చెట్టు.

"నాలోపల" అని జవాబిచ్చాను.

"ఏమేమి చేస్తుంటావు అక్కడ నీవు?" అని ప్రశ్నించింది చెట్టు.

"సృష్టిస్తూ కల్పిస్తూ వుంటాను," అని జవాబిచ్చాను.

"ఇట్లాంటి పరిమితులకు లోబడి వున్నావుకదా, మరి ఏవిధంగా నీవు సృష్టించ గలుగుతున్నావు?" అని ప్రశ్నించింది చెట్టు.

"నీరు వున్నదనుకో దానికి గట్లు వున్నాయి. అవే నీటికి పరిమితులుకాని యీ పరిమితులను చీల్చుకొని నీరు ప్రవహించడం లేదూ? ప్రవహించినది అవుతున్నదికాదూ? అదేతీరుగా, అట్లాంటి పరిమితులను చీల్చుకొని నాలో భావాలు ప్రవహిస్తూ వుంటాయి. చివరకు, అవి సృష్టిగా మారుతాయి. వేరువేరు పరిమితులలోపల చిక్కుకొన్న వస్తువు ఒకటే వస్తువు కావచ్చు. కాని అది ఒక

సారి మణిగా మారుతుంది. మరొకసారి చెట్టుగా మారుతుంది" అని వివరించి చెప్పాను.

నాకు వుంటూవున్న పరిమితులను గురించి మరింత వివరించి చెప్పమని అడిగింది చెట్టు.

"నాకు మనస్సే పరిమితి. దానిలోపల చిక్కుకొన్నది ఏదైనసరే, దానిని నేను సృష్టిస్తాను. అని జవాబుచెప్పాను.

"ఆ నీ సృష్టి, ఏపాటిది ? అది ఎంతో స్వల్పమైనది. అంతేకాదు—దానికి కంచెలవంటి పరిమితులు వుంటాయి. అలాంటి దాని కిన్నీ. సూర్య చంద్రాదులవంటి వాటి కిన్నీ యెలాంటి పోలిక వుంటుంది?" అని అడిగింది చెట్టు.

"పోలికలేకపోవచ్చు. నా సృష్టిని కొలిచే కొలమానాలకూ, సూర్య చంద్రాదులనుకొలిచే కొలమానాలకూ సంబంధంలేదు. అవి. వేర్వేరు. సూర్యచంద్రాదులు వెలుపలి ప్రపంచానికి సంబంధించినవి. నాసృష్టి లోపలి ప్రపంచానికి సంబంధించినది." అని చెప్పాను.

"అయితే దానినెలా కొలుస్తావు నీవు?," అని అడిగిందిచెట్టు.

"సుఖ దుఃఖాల కొలమానముతో కొలుస్తాను." అన్నాను.

"పడమటి గాలి వచ్చి నాచెవిని యిల్లు కట్టుకొని ఏవేవో గుస గుస లాడుతుంది. అప్పుడు నా ప్రాణం సంతోషంతో కంపించిపోతుంది. కాని నీవు చెప్పేది నాకేమీ బోధపడలేదు." అన్నది చెట్టు.

"మరి నేనేమి చేయను? నా వీణాతంత్రులలో పడమటి గాలి వచ్చి తగుల్కొన్నప్పుడు, పరిపరివిధాలైన రమణీయ వస్తువులుగా మారిపోతుంది. ఏ తెలియని ఆకాశాలలో యీకొత్త సృష్టి వీస్తుందో గాని నేనెరుగను. కాని, అంతు పొంతులేని దుఃఖపు మిన్నుఒకటి

వుందని అనుకొంటాను. దానినికొలవడానికే వీలులేదు. అదుఃఖపు ఆకాశాన యిది వీస్తుందేమో ననిపిస్తుంది," అన్నాను.

"నీవు చిత్రమైన జీవివి. మాకు ఒకే ఒక ఆకాశం, ఒకే ఒక ప్రపంచం వుంటే, నీకేమో రెండు రెండు వున్నాయి. నీవు చెప్పేదాని తాత్పర్యం రవంతకూడా నాకు బోధపడలేదు," అన్నది చెట్టు.

బోధపడినా. పడకున్నా వచ్చేదీ పోయేదీ లేదు," అన్నాను నేను.

"కాని, నేను చెప్పేమాటల తాత్పర్యం నీకుబోధపడిందా?" అని అడిగింది చెట్టు.

"నీ మాటలు గుమికూడి నా మనస్సులోపలికి మూకవుమ్మడిగా దూరిపోతున్నాయి. అక్కడ వాటికి మరొకరూపు వస్తున్నది. కొన్ని చిత్రమైన వూహాలుగానూ, కొన్ని పాటలుగానూ మారిపోతున్నాయి. నీమాటలు." అన్నాను నేను.

మర్రిచెట్టు కొమ్మలను అన్నిటినీ పైకెత్తి, "కాస్సేపు వూరుకోవయ్యా, పుణ్యముంటుంది. చూస్తే, నీవు ఆలోచనల పుట్టవూ, మాటలగుట్టవూ లాగున్నావు," అన్నది.

చెట్టు చెప్పింది అక్షరాలనిజమే. "మాట్లాడకుండా వుండిపోదామని యిటు నీదగ్గరకు వచ్చాను. కాని అలవాటు బలమైనది. నిశ్శబ్దంలోకూడ నేను మాట్లాడుతుంటాను. కొందరు నిద్రలో లేచి నడిచేవాళ్ళులేరూ? ఆలాగు," అని చెప్పాను.

మందపు మొద్దుచూపులతో ఆ చెట్టును చూడసాగాను. సూర్యరశ్మి అనే వీణెమీద, గాయకుని చేతివ్రేళ్ళవలె, నున్నని ఆకులు గబగబ జరిగిపోతున్నవి.

"నీవు చూస్తున్నదానికీ, నేను ఆలోచిస్తున్నదానికీ లంకె యెక్కడ?" అని నా మనస్సు ఉన్నట్టుండి హఠాత్తుగా నన్ను ప్రశ్న వేసింది.

"మరో ప్రశ్న వేస్తున్నావా? కాస్సేపు నోరుమూసుకొని పడివుండలేవు?," అని నేను నా మనస్సును కసిరికొట్టాను.

మాటలన్నీ ఆపుచేసి, త్వరగా గడచిపోతున్న పగలను చూస్తూవుండిపోయాను,

"అంతా బోధపడిందా నీకు?" అని చెట్టు అడిగింది నన్ను.

"ఆహాః! బోధపరచుకొన్నాను," అని జవాబు చెప్పాను.

ఆ మరుసటిరోజున, నా మనస్సు నన్ను అడిగింది. "పన్న మర్రిచెట్టుకు కళ్ళు అప్పగించి, అంతా బోధపరచుకొన్నానని దానితో నీవు చెప్పినావే, ఏమిటయ్యా నీకు బోధపడింది? కాస్త నాకుచెప్పు" అని.

"ఆలోచనలు రేపిన పొగలో, నా ప్రాణాగ్ని అస్పష్టమై పోయింది. అది తిరిగీ భగ్గుమని ప్రజ్వరిల్లితే బాగుండుననిపించింది. అందుకోసమే వచ్చికనూ, వృక్షాన్నీ ఆశ్రయించాను." అని చెప్పాను.

"మరి నీవేమి చూడగలిగావు?." అని నామనస్సు తిరిగీ నన్ను అడిగింది.

"నాయీ ప్రాణాగ్ని ఎన్నో రూపాలు ధరిస్తుంది- పసరు నిండిన ఆకులుగా, వాసనలు చిమ్మేపూవులుగా. వన్నెముదిరిన పళ్ళుగా లక్షోపలక్షల రూపాలు ధరిస్తో సంతోషిస్తూంది. కాబట్టి మర్రిచెట్టును పరీక్షగా చూచి, ఆశ్చర్యపడి నేనిట్లా అన్నాను. 'వృక్ష

రాజమా, యీ భూమిపై ప్రాణం మొట్టమొదటిసారి జన్మించి నప్పుడు, సంతోషపు కేక ఒకటి వినవచ్చింది. అదేకేక, యీ నాడు నీ రెమ్మలలో వినిపిస్తూ వుంది. ఆతొలియుగాలనాటి కప టములేనినవ్వు నీ ఆకులలో మిలమిలలాడుతూ వుంది. ఆ తొలి ప్రాణశక్తి నాలో కదులుతున్నట్లు, మెదలు తున్నట్లు వుంది. ఆలోచనలక్రింద అది యిప్పటివరకు అణగి కదలమెదలలేక పోయింది. కాని 'బయటికి వచ్చి ఎండనూ, గాలినీ అనుభవించు. కుంచెనూ రంగునూకూడా తెచ్చుకో.' అని నీవేదానిని పిలిచావు." అని చెప్పాను.

నామనస్సు కొంతకాలం వూరకే వుండింది. తర్వాత, నావైపు తిరిగి, "నీ వెంత సేపటికీ ప్రాణం గురించే మాట్లాడు తావేకానీ నీ వాడుకకు ఎంతోశ్రమపడి నేనుసేకరించిన పరికరాలను గురించి తలవనే తలవవు," అని దిగులుతో అంది.

"వాటిగురించి నేను మాట్లాడ వలసిన అవసరం వుందా. తమనుగురించి తామే అవి బిగ్గరగా మాట్లాడుకోగలవు. వాటి పరువు వల్ల భూమి మూలుగుతూవుంది. పేర్పులుపేర్పులుగా అవి మిన్నంటుతూవున్నాయి. యింకా ఎంతఎత్తుకు గుట్ట పడతాయి? ఈ ప్రశ్నకు జవాబు మఱ్ఱిచెట్టు ఆకుల మీద స్పష్టంగా వ్రాసివుంది," అన్నాను నేను.

"నిజంగానా? ఏమిటో ఆజవాబు?" అని అడిగింది నన్ను నా మనస్సు.

"ప్రాణమనేది లేనప్పుడు, అంతా వట్టిమోత; అంతా వికారపదార్థపు బరువు. కాని, ప్రాణమనేది తాకిన వెను వెంటనే, వస్తువుతో వస్తువు చేరుతుంది. చేరి, సుందర పదార్థ

మవుతుంది. రుజువు కావలెనంటే, మర్రిచెట్టును చూడు," అని చెప్పాను.

చరిత్ర అనేది మొదలు కాని తొలినాళ్ళలో, ప్రాణం నిద్ర నుండి మేల్కొని, ప్రయాణం మొదలు పెట్టింది. కదలిక లేని వస్తు ప్రపంచానికి ప్రయాణం కట్టింది.

దీనికి అలుపు సొలుపులేదు. రాజకుమారునికి వుచితమైన దుస్తులు దీనివి. చెక్కుచెదర లేదు, మాసిపోలేదు.

ఈ జ్యేష్ఠమాసపు ప్రొద్దుటిపూట, ఆనాటి ప్రాణశక్తి మర్రి చెట్టులో నాకు కనిపిస్తూ వుంది. దాని రెమ్మలుకొమ్మలు వూగుతూ వుంటే, "నమస్తే. నేస్తం," అని నన్ను హెచ్చరించుకొన్నట్లుగా వుంటుంది.

"యువరాజా, ఎడారి రాక్షసునితో నీవు పోట్లాడుతున్నావు కదా. అంతా అనుకూలంగానే వుందా నీకు?", అని అడుగుతాను నేను.

"ఫరవాలేదు, నీ చుట్టూ చూచుకో ఒకసారి." అంటుంది ఆ చెట్టు.

నేను చుట్టూ చూచుకొంటాను. కొన్ని పొలాలు గరికతో పచ్చబారి, కొన్ని వరినారుతో ఊగుతూ వున్నాయి. వాటికి ఎగువగా, ఫల వృక్షాలతో నిండిన అడవి విస్తరించుకొని వుంది. భూమీ, ఆకాశమూ కలిసికొనేచోటు యీ అడవి మూలాన కనిపించడంలేదు.

"యువరాజా, నీవు ధీరుడివి. పసివాడివే కావచ్చు, కానీ రక్కసితో హోరాహోరీ పోట్లాడు తున్నావు. వాడు మహా బల శాలి, మహాక్రూరుడు. చూడడానికి యింత గడ్డ లేవు నీవు. నీ

అమ్మల పొదిలో బాణాలు ఎన్నో లేవు. రక్కసికి రకరకాల బటువైన ఆయుధాలు, తళతళ మెరిసే కవచం వున్నాయి. కాని, ఏ దిక్కున చూచినాగాని, నీ పచ్చ జండాలే గాలిలో ఆడు తున్నాయి. రక్కసి గొంతుకమీద కాలుపెట్టావు. రాళ్లుకూడ ఓటమిని ఒప్పుకొన్నాయి. నీ ముందు బానిసవలె. దుమ్మూధూళీ సలాము కొట్టుతున్నది." అన్నాను.

"ఇదంతా ఎక్కడ కనిపించింది నీకు?" అని అడిగింది చెట్టు.

"నీ యుద్ధాలు శాంతివలె వుంటాయి. నీవు చేసే పనులు తీరికలాగుంటాయి. నీవు పొందిన గెలుపు అణకువ వలె కని పిస్తుంది. కంటికి కనరాని నీ యుద్ధాల యెత్తుగడల నేమి, నీ విజయ రహస్యాల నేమి నేర్చుకొనేందుకు ధ్యానపరులు నీవద్దకు యిందుచేతనే వస్తుంటారు. ప్రాణమనేది ఏ ఏ పనులు ఎట్లా ఎట్లా చేస్తూ వుంటుందో మాకు నేర్పడానికి, అడవులలో నీవు బడులుపెట్టావు. అలసినవారు, సొలసినవారు నీ నీడకు వచ్చి వుంటారు. ఉత్సాహం కోల్పోయినవారు నీ సలహా కోసం వస్తారు." అన్నాను.

వట వృక్షంలోని ప్రాణశక్తి నా మాటలు విని సంతోషిం చింది. "ఎడారి రక్కసితో నేను పోట్లాడుతున్నమాట నిజమే. కాని నాకొక తమ్ముడు వున్నాడు. వాడు ఏ యుద్ధానికి పోయాడో నాకు తెలియదు. అతనిని గురించే కదూ నీవు యింతకుముందు మాట్లాడుతూ వుండింది?" అని అడిగింది.

"అవును. ఆ నీతమ్ముణ్ణే మేము మనస్సు అంటుంటాము" అన్నాను.

"నాకైనా తీరుబడి వుంటుందేమో కాని, వాడికి అదేమీ లేదు. తృప్తి అనే మాటే తెలియదు. అతని కబురేమైనా తెలుసా నీకు?" అని అడిగింది ఆ చెట్టులోని ప్రాణశక్తి.

"తెలియకేమి ? బ్రతికేందుకు నీవు పోరుసల్పుతూ వుంటే వాడు లాభానికి పోట్లాడు తున్నాడు. ఎక్కడో త్యాగానికి మరొక పోట్లాట జరుగుతూంది. జడమైన దానితో నీవు పోట్లాడుతున్నావు. లేమితో అతడు పోట్లాడు తున్నాడు. లోభముతో వేరొకరు పోట్లాడు తున్నారు, పోరు ఘోరమవుతూవుంది. జయాపజయాలు ఏవరివో చెప్ప వీలులేదు. ఈ సందేహాలలో సైనికులకు వుత్సాహాన్ని కల్పించేవి నీ పచ్చ జండాలు. 'ప్రాణానికే జయమదెగాక" అనే జీవ సంగీతం క్రమక్రమంగా వుచ్ఛ స్థాయిలోకి వెళ్ళుతూవుంది. బిగ్గరై, బిగ్గరై, చివరకు అది పగిలి పోతుందేమోనని భయం కలుగుతూవుంది. కాని సుడులు తిరిగే యీ సంగీతానికంటె బిగ్గరగా 'భయంలేదు!' అంటూ నీ వీణ అరచి చెబుతూవుంది. నా వీణా తంత్రులనుండే యావత్ ప్రాణపు మూలధ్వని బయలుదేరుతూ వుంది. అన్ని వెర్రిమొర్రి రాగాలు చిట్ట చివరకు యీ ధ్వనిలో అణగి మణగిపోతాయి. అప్పుడు పరమ సుందరమైన ఎంతో శ్రావ్యమైన, నిత్యమైన పాట విన వస్తుంది. పూవులు పూసేటట్లు పళ్లు పండేటట్లు, యిచ్చి పుచ్చుకోవడమనేది మామూలు వ్యవహారమవుతుంది, అని నీ వీణ పలుకుతుంది," అన్నాను నేను.

# భిక్షుకుడు

"బుద్ధునికొరకు యీ భిక్షాపాత్రను చేబట్టి వచ్చాను. మేల్కోండి, పౌరులారా, నిద్దర లేవండి. మీకు వున్నది ఏదైనా సరే, యిచ్చుకోండి." భిక్షుకుని గొంతుక రాజధానీ నగరమైన శ్రావస్తి వీధులలో కంచుగంటవలె మ్రోగసాగింది.

తూర్పుదిక్కున తొలి వెలుగు మిలమిల మంటూవుంది. కాని యింకా నగరమంతా నిద్రలో మునిగివుంది. ఇప్పుడిప్పుడే కోకిలలు కుహూ, కుహూ సంగీతాలు మొదలు పెట్టినవి. "మేల్కోండి. వినండి, మేఘాలు తమకున్న దానినంతటినీ భూమికి యిచ్చి వేస్తున్నవి. ఉన్నది వదులుకోవడం కంటె మిన్న లేనేలేదు" అని ఆ గొంతు అరచి చెప్పుతూ వుంది.

రాజరాజు ఆలకించాడు. అధికార పటాటోపమంతా పనికి మాలినట్టిదని గ్రహించాడు, ప్రపంచాన్ని విడిచిపెట్టి పోవలెననే కోరిక, వున్నట్టుండి ధనికులలో వ్యాపించింది. ఎందుకో తెలియకుండా ఒక యువతి వెక్కి వెక్కి యేడుస్తూ, కన్నీరు ఓడుస్తూ వుంది. భూలోక సుఖాలూ, భోగాలూ నలిగి, తునిగిపోయిన పూలమాలవలె కనిపించసాగినవి.

కిటికీలు బారుగా తెరచుకొంటున్నవి. పూర్తిగా విరిగిపోని వేకువ చీకటిని స్త్రీ పురుషులు కళ్ళతో చీల్చిచూస్తున్నారు, సన్యాసి

కనుపిస్తున్నాడు. ఒంటరిగా వీధులబడి పోతున్నాడు. బంగారు ముద్దలనూ. నగలు నాణేలనూ పట్టుకొని వచ్చారు వర్తకులు. ఇవి అర్పిద్దామనుకొన్నారు వర్తకులు. ఆయన వారిని తిప్పి పంపు తున్నాడు. శూన్య భిక్షాపాత్రను యెత్తిపట్టుకొని, "వినండి. పౌరులారా, వినండి, మీకు వున్నదానిలో వుత్కృష్టమైన దానిని అయ్యగారికి సమర్పించుకోండి'" అంటున్నాడు.

రాజాధిరాజుకూడా అవమానపడి, వచ్చినదారినే తిరిగి పోయాడు. కోట్లకు పడగలెత్తిన వర్తకులూ, భూమికి భర్తలైన సంపన్నులూ అవమానపడి వచ్చినదారినే తిరిగిపోయారు. అయ్యగారికి అర్హమైన భిక్షను వేసినవారే లేరు. ఈ భిక్షుకుడెవడో చిత్రమైన భిక్షుకుడు, శ్రావస్తి నగరపు సిరులన్నీ తన పాదాల ముందు రాశిపడినా, వాటిని ఆయన ముట్టనేలేదు.

సంపన్నుల వీధులను విడిచిపెట్టి, ఆయన చీకటిగొందిని చేరుకొన్నాడు. దారిద్ర్యము పరచిన నీడలో మునిగిన సందులో ప్రవేశించాడు. పిలుపును విని, బంకమట్టి గుడిసెనుండి ఒక స్త్రీ బయటికి వచ్చింది. ఆయన పాదాలనుండి ధూళిని తొలగించింది. ఆయనను కొద్దిసేపు వేచివుండమని చెప్పింది. తలుపు చాటు చేసికొని, చిరుగులు పడిపోయిన తన కట్టు బట్టలను విప్పి, ఆయన చేతులలోకి విసరి వేసింది. తనకున్న యావదాస్తినీ అర్పించింది. వివస్త్రయై, తలుపు చాటున నిలచి పోయింది. సన్యాసి ముఖం జ్వాలవలె వెలిగింది.

"ధన్యవు, తల్లీ, ధన్యవు! రాజాధిరాజు యివ్వగలిగిన దానికంటె యెంతో అధికం యిచ్చావు." అన్నాడు.

చిరుగులు పడిపోయిన ఆ వుడుపులను తన ఎదుదు రొమ్మున హత్తుకొని, అయ్యగారికి అర్పించడానికి బయలుదేరి పోయాడు.

# అనంతుడూ, నిత్య నూతనుడూ

రాత్రి ఎంత ప్రొద్దుపోయింది? జవాబులేదు. యుగాల, కల్పాంతాల పద్మవ్యూహానబడి, కాలమే గ్రుడ్డిదైనట్లుగా దారి తెలియక తికమకలుపడి తడుముకొంటూ వుంది. చనిపోయిన రక్కసి కనులొట్టవలె, కొండ దిగువ చీకటి కటిక నల్లబారివుంది. మబ్బులు ఆకసాన్ని ఎక్కి త్రొక్కుతూ, వూపిరి ఆడకుండా వుక్కిరి బిక్కిరి చేస్తున్నవి. అక్కడక్కడ వున్న కరకురాళ్ళూ, బొరియలూ పిశాచలోకానికి సంబంధించినట్లుగా భయం కొలుపుతున్నవి. నిశాదేవత దేహావయవాలు నల్లనివి ముక్కలు ముక్కలుగా చీలి తునిగి ఆ రాళ్ళనిండా, బొరియలనిండా, పడివున్నట్లుగా వుంది. ఆకాశాన అగ్గిపిండ మొకటి కోపాన కళ్లు వురిమి వురిమి చూస్తున్నట్లుంది. ఇంకా తెలివిడి కాని గ్రహపు కెంపుకన్నా అది? లేకుంటే అతి పురాతనమైన ఆకలి చాచిన నెత్తురు లొలికే నాలుకా? జ్వరం అతిశయించి గుణం వచ్చినప్పటివలె, ఏవేవో వస్తు సముదాయాలు గొంతు కీచుపోయేటట్లు పిచ్చికేకలు పెట్టి గిరగిర తిరిగిపోతున్నవి. ఏమిటో అవి! తల తిరిగి, బాధ్యతలు మరచిన అధికారమనే భవంతినుండి విరిగి పడిన భాగాలో, ఇంకి కనుమరగి పోయిన నదిపై వంతెనలో, పాములు పుట్టలు బెట్టిన దేవాలయపు శిధిలాలో. ఏమిటో అవి!

హఠాత్తుగా చెవులను బ్రద్దలుచేసే ఘోరమైన భయంకర శబ్దం!

నురుసులు క్రక్కుతూ దూకిపడుతున్న మహాప్రవాహపు విసురుకు గుహలన్నీ కూలిపోతున్నాయా? కార్చిచ్చు వాతబడిన మహారణ్యం లేపే ఏడుపులా, ఏదోభయంకరమైన శబ్దం! ఏమిటో తెలియని ఆగడబిడలోనే వేరొక ధ్వని మరింత తగ్గుశ్రుతిలో విన వస్తున్నది. అగ్ని పర్వతం పగిలిన హడావుడిలో అగ్నిద్రవం ప్రవహించేటట్లు, ఆ హెచ్చు గడబిడలో యీ తగ్గుశ్రుతి వినవస్తున్నది. ఈ సులచేత, ద్వేషాలచేత పలికే మాటలు ఒకటిగా కలిసి, దుష్ట శబ్ద ప్రవాహాన సంగమిస్తున్నవి. చరిత్ర గ్రంథంనుండి చినిగిపోయిన పుటలవలె స్త్రీ పురుషులు అటూ యిటూ నడయాడుతున్నారు. ముఖాలమీద భయం పచ్చ ముద్రలు పొడిచినట్లయింది. ఎవడో ఒక పురుషుడు కోపాన వశం తప్పి. ప్రక్కవాడిని కొట్టుతున్నాడు. వాళ్లిద్దరూ అడవిపసరాలవలె పోట్లాడుతూ కొట్లాడుతూ వున్నారు. "తాము చేసేదేమిటో తామే యెరుగని మన బిడ్డలకు దుర్గతి ప్రాప్తిస్తుంది." అని ఒక స్త్రీ ఏడుస్తూ కేకలు పెట్టుతూవుంది. కాని మరొక ఆడది సిగ్గు విడిచి, గుడ్డలు విప్పివేసికొని, పిచ్చి నవ్వుతో సతమతమై, "లోకంలో ప్రతిదీ పనికిమాలిపోయింది. లోకముతో మనకేటికి?" అంటూ అరచి చెప్పుతూవుంది.

పర్వత శిఖరాన పేరుకొన్న నిశ్శబ్దాన, ధావళ్యాన, భక్తుడు కూర్చుని వున్నాడు. నిద్రనెరుగని కళ్ళు అతనివి, వెలుగు రవంతైనా కనిపిస్తుందేమోనని, కారు నల్లసి ఆకాశానికేసి దీక్షగా చూస్తున్నాడు. మబ్బులు ముసురుకొంటున్నవి. చీకటిలో రాత్రి

పిట్టలుపెట్టే కూతలు హడలుగొట్టుతున్నవి. ఆ సమయాన, "భయపడకండి సోదరులారా, భయపడకండి, మానవుని నిజమైన శక్తిముందు, ఘనతముందు ఎదురు నిలువగలిగినది ఏదీ లేదు." అంటున్నాడు.

కొండ దిగువ వున్నవాళ్లు యిది విన్నారు. "మూర్ఖుడా! నీ మాటలు విని మేము మోసపోము. పసరాలు మనకు యిచ్చి పోయిన దేహశక్తికి వున్న బలం మరి దేనికీలేదు," అంటున్నారు.

హింసలపాలై, బాధలు పడుతున్నప్పుడు, "ఆర్తత్రాణ పరాయణా! దీనబాంధవా! ఎక్కడ వున్నావయ్యా?" అని గోల పెట్టుతున్నారు.

"మీ ప్రక్కనే వున్నాను, సోదరులారా" అని జవాబు వస్తుంది. చీకటిలో గ్రుడ్డివారై, ఒకరినొకరు తేరిపార జూచుకొని, "ఆ గొంతుమాయ. భయంవల్ల మనం భ్రమపడుతున్నాము. మనసును సంతోషపెట్టుకోవడానికి యీభ్రమను మనమే కల్పించు కొన్నాము" అంటారు. "ఎండమావివంటి దానిని, భ్రమలను కూడా తన అదుపులోకి తెచ్చుకొనేందుకు, మానవుడు కలకాలం పోరు సల్పగలడు", అని కూడా అంటారు.

మబ్బులు విడిపోయినవి. వేగుచుక్క పొడిచింది. భూదేవి సంతోషాన నిట్టూర్పు విడిచింది. "బయలుదేరడానికి యిదే అదను," అంటాడు భక్తుడు.

బంగారు ద్రవమనే రంగుతో ఉషస్సు అనే చిత్రకారుడు ఆకాశానికి రంగులు వేస్తున్నాడు. లోక జీవనమనే చెట్టు నుని వేళ్లకూడా ప్రాణముతో సంతోషముతో కంపిస్తున్నవి. "బయలు

దేరడానికి యిదే అదను." అని ప్రతి ఒక్కని చెవిలో ఏదో గొంతుక ఎవరిదో గుసగుసగా వూది చెప్పుతుంది.

"దేనికోసం యీ ప్రయాణం?", అని ప్రశ్నిస్తారు.

"వాంఛా సిద్ధికోసం, కోరికలు ఫలించడంకోసం," అని జవాబు. ఈ గుసగుస మాటలను ఆ గుంపు బిగ్గరగా ప్రతిధ్వనిస్తుంది. రహస్యాలు బట్టబయలు అవుతాయి. గుసగుసలు మహాధ్వనులు అవుతాయి. పురుషులు ఆకాశంవైపు కళ్ళు అప్పగిస్తారు. స్త్రీలు మోకరిల్లుతారు. బాలబాలికలు చప్పట్లు చరుస్తూ, కేరింతాలు కొట్టుతారు. దివ్యతేజస్సుతో మిలమిలలాడే ఆ ఒక్క ముఖాన్ని అందరూ తేరిపార జూస్తారు. చూచి, "నమస్తే నమస్తే, మహానాయకా!", అని అరుస్తారు.

గంగానదీ తీరాలనుండి, నైలునదీ మైదానాలనుండి, టిబెట్టు దేశానగల మహాపర్వత లోయలనుండి, ఒక్క దిక్కేమిటి, అన్ని దిక్కులనుండి యాత్రికులు బయలుదేరారు. నగరాల ద్వారాలను దాటి ప్రవహించుతున్నారు. పర్వతాల నెక్కుతున్నారు. రథాలతో, కాలినడకన, గుర్రాలమీద, ఏనుగులమీద పోతున్నారు. శిరస్త్రాణాలమీద, బల్లేలమీద ఎండపడి తళతళలాడుతుంటే, రాజు మహావైభవాన పోతున్నాడు. చిరుగులను తాల్చి బిచ్చగాళ్ళు పోతున్నారు. అనేక మతాలను నమ్మేవాళ్లు వున్నారు. గురువులున్నారు, శిష్యులున్నారు. కన్యలూ, గృహిణులూ, బిడ్డల తల్లులూ, వేశ్యలూ వున్నారు. గ్రుడ్డివాళ్ళు, కబోదివాళ్లు, కుంటివాళ్ళూ వున్నారు. బజారులో నిలిచి మతాన్ని తెగనమ్మే మత ప్రచారకులు వున్నారు.

వీరి నందరినీ వాంఛాసిద్ధికి కొనిపోతున్నాడు భక్తుడు.

వాంఛాసిద్ధి !

అంటే ఏమిటి ? వీళ్ళు లోలోపల కుళ్ళినవాళ్ళు. దోపిడిని గురించి కొందరు దౌర్జన్యాన్ని గురించి కొందరు. అత్యాశను గురించి కొందరు ఆశలు పెట్టుకొని వున్నారు. ఆ నిజమైన ఆశలకు ముసుగు కప్పి, యీ పవిత్రమైన పదాన్ని ఆశ్రయించారు.

బాట దుర్గమంగా వుంది. కరకురాళ్ళతో నిండి వుంది.

మాటా పలుకూ లేకుండా భక్తుడు ముందు నడుస్తున్నాడు. ఆయన వెనుక బలవంతులూ, దుర్బలులూ, యువకులూ, వృద్ధులూ, సంపన్న ప్రభువులూ, ఆగొన్న కర్షకులూ నడచిపోతున్నారు. పోయి, పోయి. అలసి పోయారు. నాయకుని మీద అపనమ్మకం బయలుదేరింది. తాము వేస్తున్న ప్రతి అడుగునూ లెక్కించుకొంటున్నారు.

"ఇంకా యెంతదూరం ?," అని కోపాన అడుగుతున్నారు. భక్తుడు ఏదోకీర్తనను పాడుకొంటున్నాడు. వారికి జవాబు చెప్పనే లేదు. పిచ్చికోపాన. కనుబొమలు ముడి వేస్తున్నారు. తిరిగి పోదామను కొంటున్నారు. కాని వెనుక వస్తున్నవారి త్రోపులవల్ల, తమ తమ పేరాశలవల్ల ముందుకు పడి నడచి పోతున్నారు.

నిద్రపోరు. నిమ్మళపడరు. ఇతరులకంటె ముందు, ముందు వుండవలెనని, లేకుంటే తనకు రాగల సొమ్ము చేజారి పోగలదని. ప్రతివాడూ మిగతవారితో పోటీపడుతున్నాడు.

రోజులు గడిచేకొద్దికీ వారి ముఖాలు కఠినమవుతున్నవి. మాటలుకత్తి అంచులవలె కోపాన కరకరలాడు తున్నవి.

రాత్రి.

దారి ప్రక్కన యాత్రికులు ఆగారు. దీపాలన్నీ ఆర్పి వేశారు. చిన్న కునుకు గాఢనిద్రగా, చివరకు మూర్ఛగా మారే టట్లు చీకటి మరింత చీకటి అయింది.

ఎవడో ఒకడు ఎగిరిదూకి, భక్తునిమీద విరుచుకొని పడ్డాడు.

"అబద్ధాలకోర్, మమ్మల్ని మోసం చేశావు నువ్వు" అన్నాడు.

ఈ మాటలు ఒక నోటినుండి మరొక నోటికి కుప్పించి దూకసాగినవి. ఇంతలో ఒకడు లేచి, నాయకుని కొట్టివేశాడు. అతనిని కొట్టేందుకు మిగతావారుకూడ బయలు దేరారు. చీక టిలో ఆయన ముఖం కనుపించలేదు. ఒక్క మూలుగైనాలేదు. ఆయన ఒళ్లు గుజ్జు గుజ్జు అయింది.

ఎక్కడో దూరానపోతున్న వాగు చేసే నీరసమైన ధ్వని తప్ప, తక్కినదంతానిశ్శబ్దమై వుంది. సంపెంగ పూలసువాసనలను గాలి మందం మందంగా కొని తెస్తూవుంది.

భయానికి యాత్రికులు తెల్లమొగాలు వేశారు. ఏడుస్తున్న ఆడంగులను మగవాళ్లు గదిమి వేస్తున్నారు. మొరుగుతున్న కుక్కను కొరడాలతో కొట్టి కొట్టి నోరు మూసేటట్లు చేశారు. రాత్రికి అంతేలేనట్లుంది. చేసిన నేరానికి ఒకరి నొకరు నిందించు కొంటున్నారు. పిచ్చివాగుడు వాగుతూ, చిందులు త్రొక్కు తున్నారు. ఒరలనుండి ఖడ్గాలు బయల్పడ బోతున్నవి. ఇంతలో ఆకసమంతా వెలుగు వెల్లివిరిసింది. గడబిడ సద్దుమణగిపోయింది.

వధింపబడిన నాయకుని శరీరాన్ని తేరిపార జూస్తున్నారు. ఆడ వాళ్లు కీచుపడేటట్లు ఏడుపులు మొదలు పెట్టారు. మగవాళ్లు ముఖాలను చేతులతో కప్పు కొన్నారు. కొందరు పారిపోదామను కొన్నారు. కాని తాము చేసిన నేరమూ, కలిగిన భయమూ వారిని బందీలుగా చేసినవి.

"ఎవరయ్యా యిప్పుడు మనకు దారి చూపగలిగిన వారు?" అని వాళ్లు ఒకరి నొకరు ప్రశ్నించు కొంటున్నారు.

"ఎవరిని మనం వధించినామో ఆయనే" అని ఒక పండు ముదుసలి అన్నాడు. ఆయన తూర్పుదిక్కునుండి వచ్చినవాడు. ఇదివిని ఎక్కడి వారక్కడ నోరుపడి పోయినట్లు వూర కున్నారు. చూపులు దించుకొన్నారు.

"అపనమ్మకం వెలిబుచ్చి ఆయనను మనం గాయపరిచాము. కోపాన ఆయనను మనం చంపుకొన్నాము. ప్రేమతో యిప్పుడు ఆయనను మనం అనుసరిద్దాము. మనలో ప్రతిఒక్కని గుండెలో బ్రతకడానికే ఆయన చనిపోయాడు. చనిపోయాడా ఆయన? లేదు. ఆయనకు చావులేదు. ఆయన అమరుడు" అని ఆ వృద్ధుడు చెప్పాడు. అందరూ ఒక్కుమ్మడిగా పైకిలేచి. మిన్నులనంటే ఘోషతో. "అమరజీవి కీర్తికాయుడౌ గాక!" అని అరిచారు.

"విశుద్ధప్రేమ, దివ్యానందమూ, విజ్ఞానమూ, తరుగని పెన్నిధులూ వున్న పవిత్రాలయానికి పోతున్నాం మేము" అని యువకులు అన్నారు.

"ఇహలోకాన్నీ. పరలోకాన్నీ జయిస్తాం" అని వేన వేల కంఠాలు ఆశను వెలిబుచ్చినవి.

ఏ పుట్టలో ఏ పాము వున్నదో! ఎవరెవరి రహస్య వుద్దే శాలు ఏమైనా కాని, వారందరూ చూపిన వుత్సాహం మట్టుకు

ఘనమైనది. యువకులు అగ్రగాములై పోతున్నారు. వారికి సందేహాలూ ప్రశ్నలూ లేనేలేవు. అలుపూ సొలుపూ లేనేలేదు ఎందుచేత ? అమరజీవి వారి మనస్సులలో కాంతిని నింపాడు.

విత్తులు చల్లివున్న పొలాలనూ, ధాన్యం నిలువచేసివున్న కొట్లనూ, అస్థి పంజరాలు ప్రాణభిక్ష మూకీగా అడుగుతూ నిలువ బడివున్నశ్మశానాలనూ దాటుకొని ముందుకుముందుకు పోతున్నారు.

మండే ఎండలకు బీటలు వారి ఎడతెగని పగటిపూట దీక్షతో నడచిపోయారు. సాయంకాలం కావచ్చింది. తూర్పు దిక్కునుండి వచ్చిన పండు ముదుసలిని పిలిచి, "అదే నా వాంఛలు ఫలించే ఆలయం ?" అని అడిగారు.

"కాదుకాదు నేస్తులారా ? అంచులు మట్టుకే ధగధగ మెరిసి పోతున్న సాయంకాలపు మేఘం మాత్రమే అది," అన్నాడు.

చుక్కలు కమ్మగా పాడుతున్నవి. వాళ్ళు నిశ్శబ్దంగా నడచి పోతున్నారు. అమరజీవి కంఠం వినిపించింది : "గమ్యం దగ్గరపడింది," అని గుసగుసగా అన్నట్లుంది.

తెల్లవారింది.

రాత్రిపూట జారిపడిన ముత్యాలు ప్రతిపచ్చిక పోచమీద మిలమిలలాడుతున్నవి.

తూర్పుదిశనుండి వచ్చిన పండుముదుసలి, రాత్రి కల గన్నాడు. ఏదో పిలుపు విన్నాడు.

"మిత్రులారా, యిదే మన గమ్యం. వచ్చేశాం. గమ్యం చేరుకొన్నాం." అన్నాడు.

కాని, వాంఛలు ఫలించే ఆలయం ఏదీ ? దాగివున్న తరుగు లేని పెన్నిధులేవీ ? బంగరుగని యెక్కడ ? ఇంద్రజాల మహేంద్రజాల గ్రంథమేదీ లేదే ?

అది ఒక పల్లెటూరు. మూపుల మోపులు వేసికొని, కట్టెలు కొట్టి బ్రతికే వాళ్లు సంతకు వస్తున్నారు. కుమ్మరి చక్రం తిరుగుతూ వుంది. నీటి కడవలతో మడుగునుండి స్త్రీలు తిరిగి వస్తున్నారు.

బాటప్రక్క నీటివూట ఒకటివుంది. తాటితోపు. దానిలో పర్ణశాల. సముద్రాలు దాటుకొని వచ్చిన కవి ఒకడు తంబురాపట్టుకొని "తల్లీ, తలుపు తీయవమ్మా", అని పాడుకొంటున్నాడు.

ఆ గుడిసెమీద వెలుగు వెల్లి విరిసింది. "తల్లీ, తలుపు తీయవమ్మా", అనే అద్భుతమైన పాట యాత్రికుల రక్తనాళాలలో ప్రతిధ్వనిస్తూ వుంది.

తలుపులు తెరచుకొన్నాయి.

పచ్చికమీద కూర్చునివుంది. ఉషస్సు ఒడిలోని వేగుచుక్కవలె, ఆమె సందిట అప్పుడే పుట్టిన పసివాడు వున్నాడు.

కవిచేతి తంబురా ఆనందపరవశమై మ్రోగిపోసాగింది. "అనంతుడైన వానికీ, నిత్య నూతనునికీ జయము దిగ్విజయము ! మహనీయ మానవాత్మకు జయము దిగ్విజయము!" అని పాడుతున్నాడు.

ప్రభువూ, భిక్షుకుడూ, పుణ్యాత్ముడూ, పాపాత్ముడూ, పండితుడూ పామరుడూ, మోకరిల్లారు. "అనంతుడైన వానికీ, నిత్య నూతనునికీ జయము, మానవునికి జయము ! మహనీయ మాన

వాత్మకు జయము దిగ్విజయము," అని మిన్నులంటేటట్లు పాడ సాగారు.

తూర్పు సీమనుండి వచ్చిన శతవృద్ధు, "దివ్యదృశ్యాన్ని చూచాను," అనుకొన్నాడు.

# మేఘదూత

మా తొలికలయికవేళ ప్రోగిన బాజాబజంత్రీల సంగీతము నాకింకా గుర్తువుంది.

"దూరమై వుండినది నేడు నిన్ను దరిసెను, ఎవరికీ అందక తప్పించుకొన్నది తానే నేడు నీకు లొంగెను." అని అనాడు పాడారు.

అంతట ఒకనాడు బాజాలన్నీ మూగవడి పోయినవి.

ఎందుచేత ? నేను తెలిసి కొన్నది కొంతమట్టుకే నిజము. ఆమె నా సరసలో వున్నదని తెలిసి కొన్నాను. కాని యింకా నాకు దూరమై వున్నదని మరచాను.

మనము మామూలుగా ప్రేమికుల కలయికనే చూస్తూ వుంటాము. కాని ఆ కలయికలో గర్భితమై వున్న ఎడబాటును చూడనే చూడము. ఆమె నా హృదయాన చోటుచేసికొన్నప్పుడే నాకు ఎంతో దూరమై పోయింది.

ఆకాశాన అడ్డులేక ఏలుబడి చేస్తున్న మహానిశ్శబ్దము, హద్దులే లేని శూన్యమువలె మా హృదయాల నడుమ విస్తరించు కొన్నది. గ్రహచక్ర సంగీతమే యీ శూన్యమును నింపగలదు.

కాని. భ్రమలతో ఎండమావులతో, ఆశలతో భయాలతో, రోజువారీ బ్రతుకులోని అల్ప విషయాలతో మేము యీ శూన్యాన్ని నింపాము.

పిండి ఆరబోసినట్లుగా వెన్నెలకాచే రాత్రులలో అప్పు డప్పుడు సన్నని పిల్లతెమ్మెరలు వీస్తూ వుంటాయి. బాధపడే గుండెతో నేను మేల్కొని పవ్వళించి వుంటాను. ఇప్పుడు నా ప్రక్కనే పవ్వళించి నిదురిస్తున్న స్త్రీని దూరము చేసికొంటినే, అని పరితపిస్తుంటాను.

పగలెల్లా పనిచేసి సాయంకాలానికి ఎవరి పద్దకు తిరిగి వస్తానో, ఆమె కూడా అందరివలెనే బంకమట్టి బొమ్మ. మునుపటి వలె యిప్పుడు నాకు ఆమె వింతగొల్పుతూలేదు. మునుపటివలె నాకు ఆమెవల్ల గొప్ప వుపయోగమేమీలేదు. కాని అంతులేని వింతగొలిపే ఆత్మ ఆమెలో వున్నదని నే నెరుగుదును. ఏ తీరున దాని అంతు పట్టగలను ? గట్టులేని యే వాంఛా ప్రవాహాన పోగొట్టుకొన్న నా ప్రేయసిని, తిరిగి కనుగొన గలను ?

తొలకరులతో ఆషాఢమాసము బయలుదేరింది. తప్పి పోయిన నా ప్రియురాలికడకు మేఘదూతను పంపుదామని కలగంటాను.

నా హృదయాధి దేవత ఎంతో సమీపమైకూడ యికనంత దూరమై పోయింది. నా ప్రేయసికడకు ఆ నా పాట రెక్కలు కట్టుకొని ఎగిరిపోవును గాక !

మా ప్రథమ సమాగమ దినము ఎప్పుడో గడచిపోయింది.

ఆషాఢమాసపు తొలకరి వానలతో, మధుమాసపు కమ్మటి వాసనలతో, తోపుల నిట్టూర్పులతో, పూవుల లొంగుబాటుతో

మరపురాని ఆ దినము ఎన్నడో గడచిపోయింది. తిరిగి దానిని చేరుకొనేందుకు దారిలో అడ్డువచ్చి, మీదికి విసురుగా దూకే కాల ప్రవాహాలకు నాపాట ఎదురీది పోవును గాక!

ఈ రోజున, ఆకాసము భూమిమీదికి వంగి, "నేను నీ వాడను", అని ఎంతో మృదువుగా గుసగుసలాడింది.

"ఇది ఏలాగున వీలుపడుతుంది? నీవు ఎంత పెద్దవాడివో ను అంత చిన్నదాన్ని", అని భూమి చెప్పింది.

"తెలియదా యేమి నీకు? ఇటుచూడు నా వైపు. అంతు లేని నా స్థనాన్ని మబ్బుల పరదాలతో తగ్గించి వేశాను." అని ఆకాశము బదులు పలికింది.

"లెక్కకు మిక్కుటమైన చుక్కల వెలుగుతో నీవు ధగ ధగ, మిలమిల మెరిసి పోతున్నావు. కాని నాడని చెప్పుకొనేందుకు నాకు ఒక్కగా నొక్క వెలుగు రవ్వకూడ లేదు", అని భూమి చెప్పింది.

"ఈరోజు నాకు నెల రాజులేడు, సూరీడు లేడు. తారలులేవు. నీ వొక్కతెవే నాకు మగిలి వున్నావు. నీవూ నేనూ మట్టుకేజోడు" అని ఆకసము బదులు పలికింది.

"కన్నీరు పొరలు పొరలుగా వ్యాపించి, నాగుండె గాలికి రెపరెప లాడుతున్నది. కాని నీవు కదలక మెదలక కనికరము యిసుమంతేని లేక, వున్నావుకదా", అని భూమి చెప్పింది.

"కనిపించలేదా ఏమి నీకు? ఇటుచూడు, నీ గుండె వలెనే నాదికూడ మైనమువలె మెత్తబారి పోయింది. అందుచేతనే

ఈ నా కళ్ళలో కన్నీరు వూటలెత్తుతున్నది. అని ఆకాశము బదులు పలికింది.

భూమిని ఆకసాన్ని కలకాలము ఎడముచేసిన విశాలమైన స్థలావకాశాన్ని, అశ్రుసంగీతముతో, ఆకాశము నింపివేసింది.

మన్ను, మిన్నుల పెళ్లినాటి మంగళ సంగీతముతో, మా యిద్దర నడుమ పరచుకొన్న శూన్యాన్ని, వానలు వురవడి చేసి నింపివేయునుగాక ! నా ప్రియురాలు దేనిని వెలిబుచ్చ జాలదో అది, హఠాత్ సంగీత విజృంభణమువలె, బయల్పడును గాక ! దూరపు తోపులవలె గాటమైన నీలివన్నె మేలి ముసుగును, నా ప్రేయసి సదా ధరించునుగాక !

కీచురాళ్ళ రొదలచేత వెదురు తోపుల చీకటి గజగజ వణకినప్పుడు, తడిగాలిలో తటతట కొట్టుకొనే దీపకాంతి హఠాత్తుగా కొండెక్కినప్పుడు, పాతబడి పోయిన లోకము వదలి, ప్రేయసి నా ఒంటరి హృదయానికి తిరిగివచ్చి, దాని చీకటిలో వెలుగు నిండునుగాక !

# తార ఆత్మహత్య

మూర్ఛలో ఒళ్లు వశము తప్పినట్లు, ఆకసమునుండి తార ఒకటి సముద్రపు నల్లని నీళ్ళమీదికి దూకిపడింది. లక్షోప లక్షలుగా వున్న తారలు అన్నీ కలవరపడి, కొయ్యబారి యీ ఆత్మహత్యను చూచినవి. తమతోబాటు వుండిన వెలుగురవ్వ ఒకటి ఏ తీరున కటిక చీకటిలోపడి రూపుచెడి అదృశ్యమైనదో తిలకించినవి.

అది విసురుగా దురుసుతో సముద్రపు లోలోతులను చీల్చు కొని. పాషాణమయమైన గట్టినేలను చేరుకొన్నది. ఇక మరి వెలుగనే వెలుగనట్లుగా ఆరిపోయిన వేనవేల చుక్కలు ఆ పాషాణ భూమిమీద చెల్లాచెదరుగా పడివున్నవి,

ఇప్పుడే ఇంతకు మునుపే గతించి పోయినదానికి మతి చెడిందా ఏమిటి? ఈ ప్రశ్నకు సమాధానము నా కొక్కనికే ఎరుక. అది మిరమిట్లు కొల్పుతూ వెలుగుతూ వుండినప్పుడు కూడా దాని మనస్సును యే బాధ తొలువసాగిందో నా కొక్కనికే ఎరుక.

ఎడతెరిపిలేని పిచ్చినవ్వువలన ఆ చుక్క ఉక్కిరి బిక్కిరై పోయింది. తన నలుపును దాచిపెట్టుకొనేందుకే బొగ్గు మంట రవ్వ నవ్వుతుంది. నవ్వు అతిశయించే కొద్దికీ అది మరింత

ప్రజ్వరిల్లుతుంది. అదే తీరున ఈ చుక్క కూడ నవ్వినవ్వి మరింత ప్రకాశించింది. మండిమండి పట్టలేనంతటి బాధ కలిగినప్పుడు, అది కాంతి సీమనుండి, నల్లటి చల్లటి జలాలమీదికి దూకిపడింది.

ఇంకా వెలుగుతున్న చుక్కలు కోటానుకోట్లు పడిపోయిన దానిని చూచి, చులకనగా నవ్వినవి.

"మనదేమి పోయింది? ఏమీ పోలేదు, ఎప్పటివలెనే ఇప్పుడుకూడ మిన్నులు మిలమిల లాడుతున్నవి", అన్నవి.

# ప్రేతము

వృద్ధుడు చావుబ్రతుకులలో కొట్టుమిట్టాడు తున్నాడు. దేశ మంతా విలపించసాగింది. "స్వామీ, తాములేకుంటే మాగతి ఏమి కాను?" అనసాగారు ప్రజలు.

ఆయన గుండె నీరై పోయింది. "అయ్యో, నేను పోయిన తర్వాత, వీరి నందరినీ చక్కజూచే నాథు డెవరు?" అని బాధ పడ్డాడు.

జాతి మొత్తం చేసిన ప్రార్థనలను దేవతలు మన్నించారు. ఆ సీమలో యీ వృద్ధుడు ప్రేతమై నివసించి వుండవలసినదిగా ఆజ్ఞాపించారు. మానవునికి చావు వుంటుంది. కాని ప్రేతం చనిపోదు.

జాతికి మనశ్శాంతి చేకూరింది.

ముందు ఎట్లుంటుందోనని ఆలోచిస్తే మన మనస్సు చింతల పాలై, వ్యాకుల మవుతుంది. కాని, గడచిపోయిన రోజులమీదనే చూపులు నిలిపినప్పుడు, చింతా చీకూ ఏదీలేదు. మనం నిర్వర్తించ వలసిన బాధ్యతలను అన్నిటినీ అప్పుడు గత కాలంమీద మోపి హాయిగా ఉండవచ్చును. అటువంటి సమయాలలో, వర్తమాన కాలంలో భూతకాలంకూడ జీవిస్తూ వుంటుంది.

ఇన్ని మేళ్లు వున్నా, కొందరు ఏమి చేశారంటే, తమకు సరైన దారిచూపేందుకు గతాన్ని ఆశ్రయించలేదు. తమంత తాము ఆలోచించ సాగారు. వృద్ధుని ప్రేతం వారిచెవులు మెలివేసింది. ఎముకలు మట్టుకే మిగిలినదాని చేతివ్రేళ్ళపట్టు తప్పించుకోలేక పోయారు.

జాతిని అంతటినీ యీ ప్రేతం ఆవహించింది. వివేకులైన వారి పసిడిపలుకులు విని. జాతి సంతోషాన, గర్వాన వుబ్బి తబ్బిబ్బైంది. తమ ముందుతరాలవాళ్ళు చేసినట్లే తాముకూడ చేస్తున్నామనీ పరమ పురాతన కాలాన భూమిపై మెదలిన సూక్ష్మాతిసూక్ష్మ జీవకణాల ఆచారాలను తాము కొనసాగిస్తున్నామనీ అనుకోసాగింది.

చుట్టూ గోడలు నిలువుగా, దేశం పెద్ద బందిఖానా అయింది. కాని, యీ గోడలు కంటికి కనుపించేవి కావు. వాటిని ఎక్కి తప్పించుకోవడ మెట్లాగో ఎవ్వరికీ తెలియదు.

జాతి జాతీ బందీయై, ప్రేతం చెప్పినట్లుగా తూచా తప్పకుండా, బానిసవలె పాటుపడసాగింది. పసరాలుకూడ చేయనంతటి బండచాకిరీవలన ఒక మేలు కలిగింది. ఎదురుతిరిగే పొగరు అణగారిపోయింది; పిరికివాళ్ళయ్యారు. ప్రేత రాజ్యంలో తిండి,

గుడ్డ, ఆరోగ్య వసతులు యివి ఏవైనా లేవేమోకాని, శాంతికి లోటేలేదు.

రోజులు యిట్లా గడచిపోతున్నవి. జాతికి తృప్తిగా వుంది. ప్రేతం నిర్మించిన కట్టుబాట్లనే ఉక్కు గుంజకు కట్టివేసిన గొర్రె పిల్లవలె వుంది.

ఇంతలో చిక్కులు రాసాగినవి. ప్రేతం యీ జాతిని ఒక్కదానినే పరిపాలిస్తున్నది. ఇదిగాక, ప్రపంచంలో ఎన్నో జాతులున్నవి. అక్కడ అభ్యుదయ రథచక్రాలు జరజర, బిరబిర జరిగిపోతున్నవి. ప్రేతానికి గల రక్తదాహాన్ని తీర్చడానికి ఒక్కగా నొక్క నెత్తుటిబొట్టును కూడ ఖర్చుచేయని జాతులు ఎన్నో వున్నవి. వాటి శక్తిసామర్థ్యాలు ఎదుగే కాని. తరుగు లేకుండా వున్నవి. కాబట్టి వాటిలో ప్రాణశక్తి అపరిమితంగా వున్నది.

ఇది చూశారు వివేకులు. ఎప్పుడో చనిపోయిన కాలానికి సంబంధించిన పుస్తకాలు తిరగవేశారు.

"తప్పు మాదికాదు, మన ప్రభువైన ప్రేతానిదీకాదు. సమస్యలదే తప్పు. ఈ చిక్కులకు బుద్ధిలేదు. అవి ఎందుకు దాపురించాలి ? ఊరకే వుండకూడదూ ?", అన్నారు ఆ తెలివి గలవారు.

జాతి యీ మాటలు విన్నది. విని, ఏమి చేసింది ? ఏమీ చేయలేదు. ఊరట పొందింది.

తప్పు ఎవరిదైనా కావచ్చును. కాని కొత్త కొత్త చిక్కులకు అడ్డూ ఆపూలేకుండా పోయింది. నిన్నమొన్ననే, సముద్రాల

కావలవున్న విదేశీయులు మిడతలదండువలె యీ దేశంమీద మూగి పడ్డారు. కోతకువచ్చిన పంటలను ఎత్తుకొని పోయారు. పొలాలను దిబూసిగా చేసివెళ్ళారు. వాళ్ళు క్రియాపరులు, శక్తి వంతులు, ముందుచూపు కలిగినవాళ్లు. మరి, ప్రేతరాజ్యం వాళ్ళను గమనించనేలేదు. ముట్టుకొంటే మైలపడతామని, వాళ్ళ దారికి దూరదూరాన నిలిచారు. ఎన్నడో చనిపోయి భూతకాలపు పవిత్రగ్రంథాలను తిరుగవేసి, "ఇహలోక వ్యవహారాలను పట్టించు కోనివారే ధన్యులు;"అని చదివినారు వివేకులు. జాతి యీ మాటలు విన్నది. విని, ఏమిచేసింది ? ఏమీ చేయలేదు. సంతోషపడింది,

సంతోషడవచ్చునేమో కాని, వాళ్ళ మనస్సులలో ఒక ప్రశ్న బయలుదేరింది, వివేకుల మాటలవల్ల ఆ ప్రశ్న అణగి పోలేదు. మనస్సులను కలచి వేయసాగింది. "పొలాల పంటలు వూడ్చుకొని పోయారుకదా, యిక పన్నులు చెల్లించడ మెట్లా ?"

గోరీమిట్టలలో లొడలొడగాలి ఒకటి పోరుపెట్ట సాగింది. చనిపోయిన వృద్ధుని నవ్వువలె ఒక జవాబు వినవచ్చింది. "మీమీ గౌరవాలతోటి, గుండె నెత్తురులతోటి, ఆత్మలతోటి పన్నులు చెల్లించి వేయండి", అని చెప్పింది ప్రేతం.

ప్రశ్నలు రాకనే వుండాలికాని, రావడం మొదలెట్టితే ఒకటీ, అరగా రానేరావు, బారులు బారులుగా వస్తాయి,

కాబట్టి మరొక ప్రశ్న వుదయించింది. "ఈ ప్రేతం కల కాలం ఏలుబడి చేయవలసిందేనా ?"

అవ్వలూ, తాతలూ నోరు నొక్కుకున్నారు.

"ఇదేమి ప్రశ్న ? కని, విని ఎరుగం. అదేమిటి ? ప్రస్తుత పరిపాలనను మార్చబూనడం దుస్సాహసం" అన్నారు.

కాని యీ జవాబు తలబిరుసు కుట్రవాళ్ళను సమాధానపెట్ట లేకపోయింది; పొగరు హెచ్చింది. "ఏదో విధంగా, ప్రేతాన్ని వైదొలగించి పారేస్తాం" అన్నారు.

ప్రేతంగారి భటులు నవ్వుకొన్నారు, "చూద్దాం ప్రయత్నించండి. కంటికి కనుపించని గోడలను పగులగొట్టినప్పుడు తెలుస్తుంది బడాయి" అని చులకన చేశారు.

ఇంతకూ నిజమేమిటి అంటే, భూతకాలమనేది చచ్చిపోలేదు, బ్రతికీ వుండలేదు. చావూ, బ్రతుకూ కాకుండా, అది ప్రేతంగా మారిపోయింది. నిద్రలో పడివున్న దేశాన్ని అది విదిలించనూ లేదు, దేశం విడిచిపోనూ లేదు.

పగటిపూట నోరు విప్పనివాళ్ళు ఒకరిద్దరు వున్నారు. నోరు విప్పితే రాజద్రోహ చర్యలు మితిమీరిపోతాయని వారి భయం. వాళ్ళు రాత్రిపూట ప్రేతాన్ని ఆవాహన చేసి, "స్వామీ! తమరు యిక దయచేయకూడదూ?" అని అడిగినారు.

ప్రేతం నవ్వింది. "మూర్ఖులారా! మీరు నన్ను పొమ్మని కోరుకోనిదే, నేను ఎట్లా పోగలను?" అన్నది.

"వద్దు వద్దు, స్వామీ! మీరు వెళ్ళిపోతే మా గతి ఏమి కాను? దిక్కుమాలి పోగలం. భయమవుతూవుంది". అన్నారు.

ప్రేతం మళ్ళీ నవ్వింది.

"మీ భయమే నా సింహాసన స్తంభం" అన్నది.

# స్వర్గచ్యుతి

నా యెదురు రొమ్ముననున్న దేవలోకపు పూలమాల వాడి పోతూవుంది. నా ముఖవర్చస్సు పాలిపోతూవుంది. నా పుణ్య ఫలం పూర్తి కావస్తూంది. ఈ వేశే నేను స్వర్గంనుండి వెళ్ళి పోవాలి,

దేవతలారా. మీలో ఒకడనై నేను లక్షయేళ్లు వెళ్ళబుచ్చి నాను, నేడు మనము యెడమై పోనున్నాము. ఇట్టి తరుణాన, మీలో రవంత సానుభూతి, రవంత కంటితడి మెదలుతుందేమోనని మీ కళ్ళ లోలోతులను పరీక్షించి చూస్తున్నాను. అటువంటిది ఏమీ కానరాకున్నది. ఆనంద ధామమైన స్వర్గము దయా దాక్షి ణ్యాలు మాని, వుపేక్ష చూపుతున్నది. నా బోటివారు. నా తోటివారు వందలాదిగా, వున్నట్టుండి ఒక్కుమ్మడిగా భూలోకపు అంతు లేని జననమరణ ప్రవాహాన వుల్కలవలె పడిపోతూవుంటే, దేవలోకము చూస్తూనే వున్నది. కాని దాని గుండెలో రవంత కదలికకూడా లేదు. కడు చిన్నని రెమ్మ పోయినప్పటికీ, అశ్వత్థ వృక్షం బాధపడుతుంది. కాని మేము వెళ్లిపోతుంటే స్వర్గానికి చీమకుట్టినట్లుకూడాలేదు. మేనకా, నీది ఏమీపోనట్లుగా ఎంత నిర్విచారంగా నృత్యం చేస్తున్నావే! ఊర్వశీ, నీ సుందర వక్ష

స్థలాన వ్రాలివున్న వీణ. నా కొక వీడ్కోలు పాటనైనా పాడదుకదూ !

హాయిగా వర్థిల్లండి, దేవతలారా ! మీ పసివాళ్ళకు అమృత పాయసాలు పెట్టండి. సుఖించండి. హాయిగా ప్రొద్దుపుచ్చండి. సుందర నర్తకులారా ! క్రూరమైన ప్రణయతాపము మీ నయన కాంతిని యిసుమంతేని మందగింప జేయదుగాక ! మీకు కోరికలు లేవు, లేమిలేదు, దిగులులేదు. మానసోద్రేకాలు లేవు. భూలోకాన, నా హృదయేశ్వరిని కనుగొంటాను. క్రొత్త పెళ్ళికూతురు ధరించే రోజావన్నె మేలిముసుగుతోటి గంధపు పొడి మత్తువాసనల నీనే శుభ్ర ముఖవర్చస్సుతోటి ఒకనాడు ఎప్పుడో ఆమె నాయింటికి వస్తుంది. నా సుఖదుఃఖాలను పంచుకొంటుంది. రాత్రి సద్దుమణగి నప్పుడు ఎప్పుడో వింతకలగా యీ స్వర్గం నాకు గుర్తువస్తుంది. మెలకువ వస్తుంది. ఏవో కోరికలు ఏవో కామనలు నాలో మెదల సాగుతవి. మరింత వింతైన కలను కళ్ళార చూస్తాను : చీకటిలో మునిగిన నా భార్యముఖాన వెన్నెల ప్రసరిస్తుంది. నా భార్య తల వెంట్రుకలు సుడులు సుడులుగా చుట్టుకొని దిండుమీద పరచుకొని వుంటాయి. నిద్రలో గాఢంగా వూపిరి తీస్తున్నందుచేత, ఆమె పాలిళ్ళులేస్తూ, పడుతూ వుంటాయి. వంగి నేను ఆమె నోటిని ముద్దాడుతాను.

దిక్కు మొక్కులేక, దీనాతిదీనవై, నిరుపేదవై వున్న భూమాతా ! నా ఆత్మ నేడు నీకోసం ఆక్రోశిస్తూవుంది. ఆ నాడు మనం ఎడబాటు అవుతుండినప్పుడు, నీవు కార్చిన విషాదాశ్రువులు

ఎన్నడో ఎండిపోయినవి. కాని, నేను నీ కౌగిలికి మరలివస్తు న్నాను. నాకు ఎదురుకోలుగావచ్చి స్వాగత సంగీత మాలపించ డానికి నీవు యీ సారి హర్షాశ్రువులను ఒలికిస్తావు కాబోలు! నీవు మునుపు పోగొట్టు కొన్నావు నన్ను. చాల కాల మయిన తర్వాత యిప్పుడు తిరిగి కనుగొన్నావు. మరిముందు, ముందు తిరిగి నన్ను పోగొట్టు కొంటానేమోనని భయాన నీ గుండె కంపించ సాగుతుంది కాబోలు.

# రాజకుమారుడు

రాజ్యాన్ని విడచిపెట్టి, బయలుదేరాడు రాజకుమారుడు. నరమానవుడు ఎవ్వడూ, ఎప్పుడూ యేలుబడిచేయని దూరసీమను కనిపెట్టవలెనని గుర్రం ఎక్కి బయలుదేరాడు.

పల్లెపట్టులలోనూ, పట్నవాసాలలోనూ స్త్రీపురుషులు వుంటు న్నారు. ప్రేమించుకొంటూ, పోట్లాడుకొంటూ జీవిస్తున్నారు. కాని, తెలియని క్రొత్త సీమలను వెదికి వెదికి కనుగొనవలెనని రాజ కుమారుడు పోతున్నాడు.

ఎక్కడికి ? ఎందుకు ?

నూతినీరు ప్రవహించదు. కొండవాగు వెల్లువలు కట్టి, వుర వడి పెట్టి దురుసుగా, విసురుగా ప్రవహిస్తుంది. రాజకుమారుణ్ణి తన రాజ్యపు పొలిమేరలు దాటనీయకుండా అట్టిపెట్టేది ఏది ? ఎడారు లను చీల్చుకొని స్వారి చేయగలడు నిర్భయుడైన రాజకుమారుడు.

వుల్లోల కల్లోలమైవున్న జలాలను సునాయాసంగా దాటిపోగలడు సాహసుడైన రాజకుమారుడు.

ఎన్నో పర్యాయాలు మానవుడు శిశువై పుట్టి, యీ అవ్వ కథను వింటుంటాడు. చీకటిలో దివ్వె కొట్టుకోదు. చెంపను చేయిపెట్టుకొని. "కథలో రాజకుమారుణ్ణి నేనేనా?" అని ప్రతి పసివాడూ ఆలోచిస్తూ కూర్చుంటాడు.

ఎడారి చిట్టచివర ఒక మహాసముద్రం వుంది. తుఫాను ముసురులతో అల్లకల్లోలమైపోయిన మహా సముద్రం. ఆ సముద్రాన చిన్నారి దీవి. ఆ దీవిగడ్డ సట్టనడుమ రాక్షసుడి కోట. ఆ కోటలో ఒక రాజకుమారి చెరపడి, నిద్రపోతూ వుంటుంది.

రాసులు రాసులుగా పోగుపడివున్న సిరిని వెదుకుతారు కొందరు. కీర్తిని కోరుకొంటారు కొందరు. సుఖాలు వాంఛిస్తారు మరికొందరు. కాని వారందరిదీ ఒక తీరు, రాజకుమారునిది మరొక తీరు. రాక్షసుడి కోటలో దూరి. రాజకుమారిని చెర విడిపించవలెనను కొంటాడు రాజకుమారుడు. సముద్రం చూద్దామా. ఘూర్ణిస్తూ వుంది. పడవలా, లేవు. కాని రాజకుమారుడికి నిరాశ లేదు. అలలను దాటికొనిపోవలెనని గట్టి పట్టుపట్టి వున్నాడు. దానికి తిరుగులేదు,

కల్పనా కథలన్నిటికీ యిదే ఆదీ, తుదీ. రాజకుమారి బందీ అయింది; సముద్రం అల్లకల్లోలమైంది; రాక్షసుడు భయంకరుడు. ఎవరికీ సాధ్యపడని పనినిచేసి, రక్కసి చేతులనుండి ఆ సుందరిని రక్షించి తీరుతానని, తీరాన ఒంటరిగా నిలిచి రాజకుమారుడు చేసిన శపథమూ - వీటిని గురించి తల్లి చెప్పుతుంటే, పిల్లవాడు నోరు తెరచుకొని, చెవు లప్పగించి వింటాడు.

చీకటిలో వానచినుకుల తపతప, కీచురాళ్ళ గోల పిల్లవాడు వింటాడు. విని, "రక్కసి కోటకు యిప్పుడే బయలుదేరుతాను" అనుకొంటాడు.

దూరంనుంచి చూస్తే సముద్రం నీలివన్నె కలవలె వుంది. మరింత దగ్గరకు పోతే, దాగీ తెన్నూ లేని జలరాసి ఎదురౌతుంది. రాజకుమారుడు గుర్రం మీదనుంచి నేలకు దూకుతాడు. కాని, ఆశ్చర్యం! ఆశ్చర్యం! కాళ్లు నేలకు అనినవెంటనే, గారడీ చేసినట్లుగా, అంతా మారిపోతుంది. ముందున్నది, మహాసముద్రమే కాదు. ఒక పట్నం. ట్రాము బళ్లు కిరకిరలాడుతూ పోతున్నవి. బాటలు క్రిక్కిరిసిపోయి వున్నవి.

మరి మన రాజకుమారుడో! ఆయన దిరుసు ఎట్లా వున్నదో చూద్దాం! ఆతను వేసుకొన్న చొక్కా మాసిపోయింది. కాలిజోళ్లు బురద బురదగా వున్నవి. ఏదో పల్లెటూరునుంచి పెద్ద చదువుకోసం పట్నానికి వచ్చిన విద్యార్థి మన రాజకుమారుడు. నాలుగు రూకలు చేతబడకపోతే, అతను బ్రతుకు సాగించలేడు. ఆ నాలుగు రూకలకోసం నానా యిబ్బందులుపడి, నానా చాకిరీ చేయక తప్పదు.

ఇక ఆ రాజకుమారి ఎవరనుకొన్నారు! ఇతగాని పొరుగింటిపిల్లే ఈ పక్కింటి అమ్మాయి ముఖంవుందే. అది చంపక పుష్పంవలె వుందా అంటే లేదు.

ఆ అమ్మాయి తలిదండ్రులు బీదవాళ్లు. వాళ్లు యిప్పుడులేరు. అత్త మామలవద్ద పెరుగుతున్నది.

మామయ్య ఏరికోరి ఒక సంబంధం తెచ్చాడు. కాబోయే పెళ్లికొడుకు బాగా వున్నవాడేకాని ముసలివాడు. పెళ్ళినాటి రాత్రి పెళ్లి కుమార్తె పక్కింటి అబ్బాయితో కలిసి వుడాయించింది. పక్కింటి అబ్బాయీ, పక్కింటి అమ్మాయీ పెళ్ళాడినట్లు కబురు వచ్చింది,

ముసలి పెళ్ళి కొడుకు పగసాధించవలెనని పట్టుబట్టి, దొంగ కేసు బనాయించాడు. కుర్రవాడు చెరపాలయ్యాడు.

కొంతకాలం బందిఖానాలోవుండి, ఆ కుర్రవాడు విడుదలై వచ్చాడు.

కాని, ముందు ముందు అతను సాగిపోగల జీవిత మార్గం అంతుపొంతు లేనిదే కాక, చీకటి మయమైనది. ఎడారిబాటకంటె దీర్ఘమైనదే కాక, భయంకరమైనది. తోడెవ్వరూలేక, పోవలసి వుంటుంది. చీకటిలోనుండి పదేపదే ఏవేవో కంఠస్వరాలు విన వస్తాయి. కాని అవి దయ్యాల అరుపులు. నరమాంసం కోసం ఆత్రంగా ఆక్రోశిస్తూ వున్నవి దయ్యాలు. నరమాంసానికి మంచి గిరాకీ వుంది,

దారికి అంతులేక పోవచ్చు. కాని ప్రయాణీకుని శక్తికి అంతు వుంది. అందుచేత, యిక ముందుకు పోలేక, అతను ఆగిపోతాడు.

నా అనేవాళ్ళు ఎవరూలేరు. మృత్యుదేవత ఒక్కతే అతని మీద చూపు నిలుపుతుంది. ఆ చూపునుంచి అతను తప్పించుకొని పోలేడు. దగ్గరపడినచావు అతని ముఖాన సూచనగా కనుపించిన వెనువెంటనే, మహాద్భుతం జరుగుతుంది. ఆ పట్నం అంత

ర్థానమై పోతుంది. కలలన్నీ కరగిపోతాయి, అతను తిరిగి రాజ కుమారుడుగా మారిపోతాడు! ముఖాన రాజకళ తొణికిసలాడు తున్నది. తాను రక్కసికోట తలుపులు బద్దలుచేసి చొచ్చుకొని పోయి, రాజకుమారి చేతి సంకెళ్ళను ముక్కలు ముక్కలుచేసి వేయవలెనను కొంటాడు.

అన్ని యుగాలలోనూ, తల్లులవద్ద కూర్చుని పసిపిల్లలు కథ వింటుంటారు, ఇల్లూవాకిలీ విడిచివేసిన రాజకుమారుడు ఎడారిలోబడి పోయిపోయి, సప్త సముద్రాల మహాతరంగాలకు యెదురు ముఖమై నిలిచిన కథ వింటుంటారు.

ఈ రాజకుమారుడు. చరిత్రలో చాలా వింతవ్యక్తి. చరిత్ర గ్రంథాలకు బయటకూడ, అతనిది వింతకథే. ఆ రాజకుమారుడు, మాపుగాని తగ్గుగాని లేని, శాశ్వత రాజకుమారుడు.

## ఈకె

పసిపాప పరుగు పరుగున వచ్చి, "అమ్మా! అమ్మా! నేనేమి తెచ్చానో చూడవే" అని గుక్క తిప్పుకోకుండా అరచి చెప్పుతుంది.

కళ్ళుకూడ నవ్వుతున్నట్లు తళతళ లాడుతున్నవి. చిన్నారి చేతిగాజులు ఎర్రటివి నాట్యమాడుతున్నట్లున్నవి. చప్పట్లుచరచి చెప్పుతున్నందుచేత, గాజులు గలగల లాడుతున్నవి. అమ్మ మెడకు చేతులు పెనవేసి, "చూడమ్మా, చూడు! నేనేమి తెచ్చానో చూడవూ?" అని అడుగుతుంది పాప.

అది మరేమీ లేదు. ఏదో పిట్టయీాకె. నీలిగానూ, పసిమి గానూ వుంది. పసిపాప చెవిలో అది ఆకాశాన్ని గురించి, మబ్బుల గురించి, గూడు గురించి, పసిపిట్టల వాగుడుగురించి, ఉదయం వేళ కలిగే ఆనందం గురించి, ఆకాశయానం గురించి ఎన్నెన్ని మంచిమంచి కథలు చెప్పుతుందని! మిసమిసలాడే పాలబుగ్గల మీద, కనురెప్పలమీద ఆ నున్నని యీాకెను పోనిస్తుంది పాప. "చూడమ్మా! నేనేమి తెచ్చానో చూడు" అని అంటుంది.

అమ్మ చూడకతప్పదు. చూచి, నవ్వుకొంటుంది.

"ఎంత పెన్నిధి పట్టుకొని వచ్చావమ్మా, తల్లీ!" అని ఆ యీాకెను విసరిపారవేసి, యింటిపని చూచుకోవడానికి వెళ్ళిపోతుంది అమ్మ.

పాపాయి నేలమీద పడి క్రుంగిపోతుంది రెక్క విరిగిన పిట్టవలె వుంటుంది. కళ్ళలో తొలినవ్వు పోయింది. కాస్సేపు తాళి, పైకిలేచి యీాకెను చేతికి తీసికొంటుంది. నాటినుంచి తాను సంపాదించిన నిధి అమ్మకూడా చూడకుండా, ఎక్కడో పదిలంగా దాచిపెట్టుకొంటుంది పాపాయి.

## విూసూ

పుట్టిన తర్వాత కొన్ని గంటలకే, ఆమె తొలి కాన్పుబిడ్డ చనిపోయింది. రెండవ కాన్పుబిడ్డ ఏడాది తిరగకమునుపే పోయింది.

ఆమె యువతి. తొడిమను అంటిపెట్టుకొనివున్న దోరకాయ వలె, ఆమె మనస్సు భూమిని అంటిపెట్టుకొని వుండేది. లోకము లోని పచ్చని వస్తువులంటేనూ, ప్రాణకళ తొణకిసలాడే వస్తువు లంటేనూ, ఆమెకు అలవిమాలిన ప్రేమ.

తమ పూరిపాక వెనుక చిట్టితోట వుండేది. బిడ్డను ఎంత జాగ్రత్తగా, కంటికి రెప్పవలె, తల్లి సాకుతుందో అట్లాగే మీనూ, మొక్కలను పెంచేది. తీగెలు యిప్పుడిప్పుడే పూత తొడుగుతున్నవి. కాని యింతలో కలకత్తానుండి వచ్చింది పిలుపు.

చుట్టుప్రక్కల వుండిన కుక్కలంటే కూడ, మీనూకు ఎంతో ముద్దు. అన్నిటిలోకి, భోంటూ అనే చప్పిడిముక్కు కుక్క అంటే ఆమెకు ఆరవ ప్రాణమే. దాని కోసమని పూసల గొలుసును చేయసాగింది. అది పూర్తికాక మునుపే, కలకత్తా నుండి ఆమెభర్త వచ్చాడు. ఆమెను కలకత్తాలో తమ కొత్త యింటికి తీసకొని పోదామని వచ్చాడు. ఆ కుక్క ఎవరిదో ఆ యజమాని దానిని మీనూకు యిస్తాను, తీసికొని పొమ్మన్నాడు. కాని మీనూ భర్తకు కుక్కలంటే పడదు. "కుక్కలు మా చెడ్డ అల్లరివి," అన్నాడు మీనూ భర్త.

కొత్త యింటిలో ఒక రాత్రి మీనూకు నిద్ర పట్టనేలేదు. ఉదయకాంతి సన్నసన్నగా దూరినప్పటికీ, మీనూ యింకా పడక మీద దొర్లుతూనే వుంది. మోచేతి వూతంమీద లేచి, కిటికీలోనుంచి చూచింది. కిటికీ ఎత్తుకు పెరిగి, పూవులు పెల్లుగా పూసిన చంపక వృక్షం కనుపించింది. మెత్తని మత్తువాసనలు తన వైపుకు తేలి

తేలి వస్తున్నవి. "చెలీ, మీనూ! కులాసాగా వున్నావా?" అని అడుగుతున్నట్లున్నవి.

తమయింటికీ, ప్రక్కింటికీ నడుమ యిరుకుసందులో వుంది యీ చంపక వృక్షం. ఎండకోసం ఆకలి వేస్తున్నట్లుగా నిక్కినిక్కి పోతూవుంది. ప్రకృతిమాతకు పుట్టిన మూగబిడ్డ యిది. తాను వుంటున్న చోటు తనకు అనువుకానిది అయినందుచేత, దిగాలు పడి వుంది.

మీనూ ఆలస్యంగా నిద్రలేస్తుంది. మరికొంతసేపు నిద్ర పోయిన తర్వాత లేచి, చంపక వృక్షాన్ని చూచింది. పూవన్న మాటే లేదు. "ఏమైనాయో అన్ని పూలు ఒక్కసారిగా!" అనుకొన్నది.

పనిపిల్లను పిలిచి, ఆ చెట్టును పరిలంగా చూడమని, పాదుకు నీళ్ళు పెడుతుండమని చెప్పింది. కాని, పూలజాడే కాన రాలేదు. అవి ఏమవుతున్నాయో తెలిసికోవడానికి మీనూకు మరి కొన్ని రోజులు పట్టింది.

అరవిరిసిన తామరపూవువలె వుంది ఉదయ సంధ్య. ఆ వేళకు చెట్టుదగ్గరకు బ్రాహ్మణుడొకడు, చేత బుట్టపట్టుకొని వచ్చినాడు. సర్కారుకు ముట్టవలసిన పన్నుపై కొన్ని వసూలు చేయడానికి వచ్చిన వుద్యోగివలె, అతడు ఆ చెట్టును రెండు చేతులా పట్టి విదిలించి వేశాడు.

"త్వరగా కిందికిపోయి, అయనగారిని యిటు రమ్మని చెప్పు," అని మీనూ తన పని పిల్లను పంపింది.

బ్రాహ్మణుడు వచ్చాడు. ఆమె నమస్కరించింది. "స్వామీ, ఎవరికోసమండీ పూవులు రాలుస్తున్నారు? అని అడిగింది.

"భగవంతుడి కైంకర్యానికి," అన్నాడు.

"ఆ భగవంతుడే యీ పూలను నాకు కానుకగా యిచ్చి వేశాడని తెలియదా ఏమి, తమకు ?". అని అడిగింది.

"నీకా ?" అన్నాడు.

"అవును, నాకే, తాను ఒకసారి యిచ్చిన దానిని తిరిగి తీసికొని పోతాడా దేవుడు ?", అని అడిగింది.

బ్రాహ్మణుడు విసుగుపడి వెళ్ళిపోయాడు.

మరురోజు ప్రొద్దుట, తిరిగి తయారు. చెట్టును వూపుతూ పూలు రాలుస్తున్నాడు. కన్నీళ్లు పెట్టుకొని, తన పనిపిల్లను పిలిచి, "నేను చూడలేనే యీ అఘాయిత్యం ! ఇక యీ గదిలో పడు కోను." అని చెప్పింది మీనూ.

మీనూ పడకను పక్కగదికి మార్చారు. ఈ గది కిటికీ రాయ్ చౌదరీగారి భవంతికి ఎదురుగా వుంది.

"అబ్బ, ఎంత ముద్దుగా వున్నాడో ఆ పాప ! కాస్సేపు నా ఒడిలో పెట్టుకోనివ్వండి - ఏమండీ !" అని ఒకరోజు మీనూ తన భర్త నడిగింది.

"వాళ్ళు శ్రీమంతులు. నేను రోజుగడవని గుమాస్తాను. మన యింటికి తీసికొనిపోనిస్తారా పాపను, వాళ్ళు ?" అన్నాడు భర్త.

"అంత విడ్డూరంగా మాట్లాడతారేమిటండీ ? పిల్లల విష యంలో ఆస్తిపాస్తుల హెచ్చుతగ్గులు ఎక్కడ వుంటాయి ? పసి పాపకు ఏ స్త్రీ ఒడియైనాకాని, సింహాసనమే కాదటండీ?" అనింది మీనూ.

భర్త పోయివచ్చాడు. "పెద్దవాళ్ళ దర్శనమే కాలేదు" అన్నాడు.

ఆ మరురోజున పనిపిల్లను పిలిచి, "చూడవే ఆ పాపాయి ఒంటరిగా బిక్కుబిక్కుమంటూ తోటలో ఆడు కొంటున్నాడు. పరుగెత్తుకొనిపోయి. యీ మిఠాయి యిచ్చిరా," అని పంపి వేసింది మీనూ.

సాయంకాలం వేళ, విచారం నిండిన ముఖం పెట్టుకొని, వచ్చాడు భర్త.

"వాళ్ళకు మనమీద అలవిమాలిన కోపం వచ్చింది." అన్నాడు.

"అదేమి ? ఏమిచేశాము మనము ?," అని అడిగింది మీనూ.

"మన పనిపిల్ల వాళ్ళ తోటలోకి యింకొకసారి కాలు బెట్టితే, పోలీసులను పిలువనంపుతారట," అన్నాడు.

"మీనూ కళ్ళలో నీళ్లు కమ్మినవి." అవును. అర్థమయింది. పసివాడి చేతినుండి మిఠాయి లాగివేశారు. చెంప ఛెటీల్మనేటట్లు కొట్టారు. ఇక్కడే యింకొక్కక్షణం వున్నా, నాకు చావు మూడు తుంది. మరొకచోటికి తీసుకొనిపొండి, నన్ను" అన్నది మీనూ వెక్కి వెక్కి ఏడుస్తూ.

# పేరు

చిననాటినుండి అతను పద్యాలు వ్రాస్తున్నాడు. ఎంతో శ్రద్ధగా తన పుస్తకపు అంచులకు రంగులు వేసుకొన్నాడు. ఎర్ర సిరాతో పద్యాలు వ్రాసికొన్నాడు. ఇంకా ఎక్కువ శ్రద్ధతో రంగులువేసిన అట్టమీద తన పేరు చెక్కుకొన్నాడు.

పత్రికలకు పంపాడు తాను వ్రాసిన పద్యాలు. పంపినవన్నీ చెక్కుచెదరకుండా తిరిగి వచ్చేవి.

అందుచేత డబ్బు సమకూరిన వెంటనే, సొంత పత్రికను నెలకొల్పుకొందామని నిశ్చయించుకొన్నాడు.

తండ్రి చనిపోయిన తర్వాత, బంధువులందరూ చేరి "అబ్బాయీ మా మాటవిని, పద్యాలు వ్రాస్తూ కాలం వృథా చేయ వద్దు. ఏదో మంచి నౌకరీ ప్రయత్నిస్తే వస్తుంది" అని సలహా చెప్పారు.

విని, తాను అపహేళనగా నవ్వాడు, వ్రాతకోతలు జోరుగా సాగించాడు. వరుసగా మూడు పుస్తకాలు అచ్చు వేయించాడు. మరుసటి పుస్తకం వెలువడిన తోడనే ప్రశంసలవర్షం కురుస్తుందని కీర్తిప్రతిష్ఠలు వస్తాయని ఎప్పటికప్పుడు ఆశించేవాడు. కాని ముమ్మారూ ఆశాభంగమయింది.

తన పుస్తకాలను చదివి మెచ్చుకొన్న పాఠకుడు ఒకే ఒక్కడు సొంత మేనల్లుడు. వాడు పసివాడు. అప్పుడే అక్షరాభ్యాసం పూర్తి అయింది. చేతికి అందిన అచ్చువ్రాత ఏదైనా కాని కూడ బలుక్కొని చదవాలని ఎంతో కోరిక పడేవాడు.

ఒకానొక రోజున, పుస్తకం పట్టుకొని, మామయ్యదగ్గరకు పరుగెత్తుకొని వచ్చి, రొప్పుతూ, రోజుతూ "మామయ్యా, మామయ్యా! నీ పేరు అచ్చుపడింది. నీపేరు. మామయ్యా," అన్నాడు.

మామయ్య మందహాసంచేసి. అల్లుడి బుగ్గమీద ముద్దుగా కొట్టాడు. అరనుండి పుస్తకం తీసి. మొదటి పుట తెరచి, "ఇది చదవగలవేమో చూద్దాం, చదివి చూడవోయ్," అన్నాడు.

అక్షరాలు కూడబలుక్కొని చదివాడు అబ్బడు. మళ్ళీ మామయ్య పేరే. అరలో మరో పుస్తకం వుంది. దానిమీదకూడ మామయ్య పేరే.

మూడు పుస్తకాలమీద మామయ్య పేరు అచ్చుపడి వుండడము చూచి, ఆ పిల్లవాడి మెప్పుకు హద్దు లేకపోయింది. "మామయ్యా, అబ్బ! నీ పేరు ఎన్నెన్ని పుస్తకాలమీద వుందను కొన్నావ్ మామయ్యా! నూరు, ఇరవై నాలుగు, నలభై ఏడు పుస్తకాలమీద వుంది మామయ్యా," అన్నాడు.

ఆనందం అతిశయించగా, మామయ్య కళ్ళు రెపరెప ఆర్పినాడు. పిల్లవాడు పుస్తకాలను జవిరి ఎత్తుకొని, ఆయింట పనిజేసే ముసలిదానికి చూపడానికి వెళ్ళిపోయాడు.

మామయ్య నాటకం వ్రాశాడు. ఆయన మిత్రులందరూ ఆ నాటకాన్ని ఆడించేవాడు సులభంగా దొరుకుతాడని చెప్పారు. తన పేరూ, తన నాటకంపేరూ ఊరంతా టముకు వేసినట్లు కలగన్నాడు.

ఆదివారంనాడు తన మిత్రుడొకడు నాటకాలాడించేవాని వద్దకు బయలుదేరిపోయాడు. ఈ నాటకంగురించి అతగాని అభిప్రాయమేమిటో తెలిసికోవాలని వెళ్ళాడు. మిత్రుడు తిరిగి వచ్చేవరకు, మామయ్య ముళ్ళమీద వున్నట్లు వున్నాడు. ఏమవుతుందో ఏమోననే చింతలో పడి వున్నాడేమో, అల్లుడు కనిపెట్టిన ఆటను ఆయన మొదట్లో గమనించనేలేదు. ఆ వూరిలోవున్న ముద్రణాలయాన యీ పిల్లవాడు తన పేరులోని అక్షరాలకు సరిపోయే అచ్చులు సంపాదించాడు. అరలోని ప్రతి పుస్తకాన్ని తెరచి తొలి పుటమీద తనపేరు ముద్రించుకొన్నాడు. మామయ్యచూచి అబ్బురపడవలెనని ఆ పిల్లవాడు వుద్దేశించాడు,

మామయ్య నిజంగా అబ్బురపడిపోయాడు. పిల్లవాడు ఏదో వూపిరి సలపని పనిలో పడివుండడం చూచి, ఏమిటది అని అడిగాడు. తాను చేస్తున్న ఘనకార్యాన్ని మామయ్యకు సగర్వంగా ప్రదర్శించాడు. మూడు పుస్తకాలమీదనే కాదు, యింకా యిరవై అయిదు పుస్తకాలమీద పిల్లవాడి పేరు అచ్చుపడివుంది.

మామయ్యకు ఒళ్లు తెలియనంతకోపం వచ్చింది. "వెధవా! చదువూ సంధ్యా విడిచిపెట్టి, పొద్దు పగలస్తం ఆడుతున్నావా? ఎంత అల్లరి వెధవ!," అని ఎంతో కష్టంమీద తాను సంపాదించుకొన్న అచ్చు అక్షరాలను లాక్కొన్నాడు మామయ్య. హృదయమే శిధిలమైనట్టు పసివాడు దీర్ఘాలు తీస్తూ ఏడుపు మొదలెట్టాడు.

ముసలి పనిమనిషి గబగబ వచ్చి, "ఏమైంది, బాబూ! ఏమైంది, తండ్రీ!" అని అడిగింది.

"నా పేరు - ఊఁ, ఊఁ - నా పేరు" అన్నాడు. అమ్మ వచ్చింది. "నా బంగారు కొండగదూ! నా వరాల మూటగదూ! ఏమైంది తండ్రీ, ఏమైందిరా?" అని అడిగింది.

ఏడుపు శ్రుతి హెచ్చింది, "నా పేరు - ఊఁ, ఊఁ - నా పేరు" అని అనగలిగాడు.

పనిమనిషి మిఠాయి పట్టుకొనివచ్చి యిచ్చింది. వాటిని విసరికొట్టాడు. "నా పేరు - నా పేరు -" అని ఘోషపెట్టాడు.

అమ్మ మళ్ళీ వచ్చి, "ఏమి తెచ్చానో చెప్పుకో! మా అబ్బాయిగారికి యింజన్ తెచ్చాను, యింజన్" అని బుజ్జగించ చూచింది.

కుర్రాడు దానిని ప్రక్కకు నెట్టి. "నా పేరు - బాబోయ్, నా పేరు -" అని వాపోతున్నాడు.

మామయ్య స్నేహితుడు తిరిగివచ్చాడు. "అతను ఒప్పుకొలేదోయ్. ఏంచేద్దాం?" అన్నాడు.

మామయ్య కాస్సేపు మాట్లాడలేదు ఇంతలో "నాకు వున్నదంతా ఖర్చుచేసి, నా నాటకాన్ని నేనే ఆడిస్తాను" అన్నాడు.

"ఇవాళ ఫుట్‌బాల్ సెమీఫైనల్ ఆడుతున్నారు. చూద్దాం, వస్తావా?" అని అడిగాడు ఆ మిత్రుడు.

"రాలేను. జ్వరం వచ్చినట్లుగా వుంది" అన్నాడు మామయ్య. పైటవేళ అమ్మవచ్చి, టీ తయారుగా వుందని చెప్పింది, తనకు టీ వద్దన్నాడు మామయ్య. సాయంకాలం భార్య వచ్చి. "మీరు రాసిన కొత్త కథ చదివి వినిపించరూ?" అని అడిగింది. తనకు తలనొప్పిగా వుందన్నాడు మామయ్య. చిన్నారి

అల్లుడు వచ్చి, "మామయ్యా ! నా పేరు తిరిగి యిచ్చివేయవయ్యా" అని గదమాయించి అడిగాడు. చెంపపెట్టే మామయ్య యిచ్చిన జవాబు.

# మనసుకెక్కిన రాణి

ఆమెకు చివరి ఘడియలు సమీపించాయా, అనిపించింది. నానా హంగామా చేసింది. నానా గల్లంతు రేపింది. ఆమెకు ఏదీ నచ్చలేదు. కనుపించని హృదయభారాలతో సతమత మవుతున్నది. ఆస్థాన వైద్యుడు ఏదో మందు యివ్వబోగా, దానినొక పక్కకు నెట్టి వేసింది.

రాజుగారు ఆమె వున్నచోటికి ఆదరాబాదరా నడచి వచ్చాడు. ఆమె పవ్వళించివున్న శయ్యకు ఒక్క పక్క నిలిచి. వంగి "ఏమిటి సంగతి ? ఎందుకు యిట్లా బాధపడు తున్నావు ? ఏమి కావలెనో చెప్పు, చిటికెలో సమకూరుస్తాను," అన్నాడు.

జవాబు చెప్పబోయింది. కాని గొంతులో ఏదో అడ్డుపడి నట్లయింది.

"వదలి పెట్టండి - నన్ను మీరందరూ విడిచి వెళ్ళండి. నా యిష్ట సఖితో మాట్లాడాలి," అని చెప్పింది.

ఇష్టసఖి వచ్చింది. ఆమె చేయిపట్టుకొని, "నీకు చెప్పవల సింది ఎంతో వుంది," అన్నది రాణి.

"అంతా చెప్పండి," అన్నది ఇష్టసఖి.

"అయితే విను. ఏడులోగిళ్ల వున్న యీ మహాభవనాన ఒక నాడు వేరొక రాణి వుండేది। మూడులోగిళ్లు ఆమె పరమై వుండేవి. క్రమేణ ఒకటి చేజారి పోయింది. తర్వాత ఒక్కటే మిగిలింది. చివరకు ఆరాణి వెళ్ళిపోయింది. రోజులు గడువసాగినై. ఆ రాణికూడ నా మనసునుంచి తొలగి పోయింది.

"అట్లతద్ది పండుగనాడు, నేను నెమలిపల్లికీ యెక్కి వీధులలో తిరుగుతున్నాను. నా పల్లకీ ముందు సంగీతవేదిక పోసాగింది. రాజోత్సవపు ఆగభోగాలు పటాటోపాలు నన్ను మైమరపించాయి.

"దారిప్రక్క నదిగట్టువద్ద, చల్లటి చెట్టునీడలో ఒక గుడిసె కనిపించింది. ఆ గుడిసె చుట్టూదడి. దడిమీదికి అల్లిబిల్లిగా ఎగ బ్రాకిపోతున్న అపరాజిత పుష్పలత. తలవాకిలి మెట్లముందు శంక, చక్ర చిహ్నాల ముగ్గులు. నాకు చత్రం పట్టిన పరిచారికను పిలిచి, "బొమ్మలాగున్నయిల్లు అది ఎవరిది ?" అని అడిగాను.

"అదా ? తొలి రాణీగారిది" అని జవాబిచ్చింది.

సాయంకాల మయ్యేసరికి భవంతికి తిరిగివచ్చాను. దీపాలు కూడ వెలిగించలేదు. ఊరకే కూర్చునివుండిపోయాను. రాజుగారు వచ్చారు. వచ్చి, "ఏమిటి సంగతి ? ఎందుకిట్లా బాధపడు తున్నావు ? ఏమి కావలెనో చెప్పు, చిటికెలో సమకూరుస్తాను !" అన్నాడు.

"ఈ మహా భవంతిలో నివసించవలెనని లేదు" అని చెప్పాను.

"సరే ! అయితే కొత్త యిల్లు కట్టిస్తాను, దంతపు గోడ లతో, పాల నురుగువంటి శంఖచూర్ణపు గచ్చుతో. ఆణిముత్యా

లతో అల్లికచేసిన తామరపూవుల అంచులతో యింద్రభవనం వలె కట్టిస్తాను. సరేనా ?" అన్నాడు రాజు.

"ఉద్యానవనంలో చిట్టచివర ఏదో మూల ఒక పూరిగుడిసె వేయించి యివ్వండి. అదే నాకు కావలసింది" అన్నాను.

"నిజంగానా? అయితే, సరే!" నన్నాడు రాజు.

గుడిసె వేశారు. పూలగుత్తినుండి గిల్లివేసిన పూవుగతి ఎట్లావుంటుందో యీ గుడిసెకూడ అట్లాగేవుంది. తయారయిందో లేదో, యింతలోనే అదివాడి, ముడుచుకొని పోసాగింది. కొంత కాలం అక్కడ ఉంటూవచ్చాను. అక్కడ వున్నంతకాలం ఎంతో అవమానం అనుభవించేదాన్ని. అవమానం.

కొన్నాళ్ళకు గంగాస్నానం పండుగ వచ్చింది.

అంతఃపుర స్త్రీలు వందమంది వెంటరాగా, నదిలో తల స్నానం చేద్దామని బయలుదేరాను. మోకాటిలోతు నీళ్ళలోకూడ నెమలి పల్లకీ నడిచింది. తిరిగి వస్తున్నాము. పల్లకీ తలుపును కొద్దిగా తెరిచి, చూడసాగాను.

ఎర్రంచు సాదాచీర కట్టుకొని, గాజులుతప్ప మరే ఆభరణాలు లేని స్త్రీ ఎవరామె ? నదిలో జలకమాడి, కడవనింపుకొంటూ వుంది. తడి వెంట్రుకలు ఎండకు మిలమిల లాడుతున్నవి. పుష్ప నైవేద్యంవలె ఎంతో పరిశుద్ధంగా వుంది!

"ఎవరావిడ? ఏ ఆలయంలో పూజ చేస్తుంది:" అని అడిగాను. చిరునవ్వు నవ్వుకొంటూ, ఛత్రగ్రాహి, "తొలి రాణిని మరచిపోయారా, అమ్మగారూ?" అని జవాబిచ్చింది.

భవంతికి తిరిగి వచ్చాము. ఒంటరిగా కూర్చుని వుండి పోయాను. ఎవ్వరితోనూ నోరువిప్పి మాట్లాడలేదు. రాజుగారు వచ్చారు. వచ్చి, "ఏమిటి సంగతి? ఎందుకు మళ్ళీ యిట్లా బాధపడుతున్నావు? ఏమి కావలెనో చెప్పు. చిటికెలో సమకూరుస్తాను" అన్నాడు.

"ప్రతిరోజూ పొద్దున్నే లేచి నదికి నడచివెళ్ళి, మట్టి కడవకు నీళ్లు నింపి చంకను బెట్టుకొని తిరిగి రావలెనని వుంది" అన్నాను.

"నిజంగానా! అయితే సరే" నన్నాడు రాజు.

నేను పోయినంతమేరా, నదివరకూ భటులు కాపున్నారు. రాకపోకలన్నీ అగిపోయాయి. బాటలు నిర్జనాలైనాయి.

ఎర్రంచుల పత్తి చీర ధరించి, చేతులకు సాదా గాజులు పెట్టుకొన్నాను. నదిలో జలకమాడి, కడవనింపి, చంకను బెట్టుకొన్నాను. భవంతిని చేరుకొనేసరికి నాపని అయిపోయింది. కడవను నేలకు విసిరికొట్టాను ముక్కలు ముక్కలైపోయింది. ఎంతో అవమానం అనుభవించసాగాను – అవమానం.

మళ్ళీ కొన్ని రోజులకు మరో పండుగ వచ్చింది.

పండుగ రేపుగద్దనంగా, ఆ రాత్రి రాత్రంతా నగరం బయట శిబిరం వేసికొని, పూర్ణిమ వెన్నెలలో, తెల్లవారే వరకు, ఆట పాటలతో గడిపాము.

ఈ వినోదాలను పూర్తిగా అనుభవించి, పట్టపుటేనుగు అంబారీలో కూర్చుని, భవంతికి తిరిగి వస్తూవున్నాను. అడవి దారిలో ఒక కుర్రవాడెవరోగాని నన్నుదాటిపోయాడు. ఒంటిగా

పోతున్నాడు. తలకు పూల కిరీటం పెట్టుకొన్నాడు. చేతనున్న బుట్టలో పళ్ళూ ఫలాలూ, ఆకు కూరలూ, దుంపలూ పట్టుకొని పోతున్నాడు.

"ముద్దులు మూటగట్టుతున్న యీ కుర్రవాణ్ణి కన్నతల్లి ఎంత అదృష్టవంతురాలో !" అన్నాను.

"తెలియదా మీకు ? తొలి రాణీగారి కొడుకేనమ్మా ! అడవి నుంచి, బీడు నుంచి అమ్మగారికి కానుకలు తీసికెళ్ళుతున్నాడు", అన్నది ఛత్రగ్రాహి.

భవంతికి తిరిగి వచ్చానే కాని, నా మనస్సు పరిపరి విధాల పోసాగింది. ఏదో పెద్ద దిగులులో పడిపోయాను.

రాజుగారు వచ్చి "ఏమిటి సంగతి? మళ్ళీ ఎందుకిట్లా బాధ పడుతున్నావు ? ఏమికావలెనో చెప్పు, చిటికెలో సమకూరుస్తాను" అన్నాడు.

ప్రతిరోజూ నాకు పళ్ళూ వేళ్ళూ ఆకుకూరలూ కాయ గూరలు తినవలెనని వుంది. నా కొడుకు స్వయంగా అడవికీ తోటకూ వెళ్ళి, వాటినన్నిటినీ బుట్టలో పెట్టి తీసుకొనిరావాలి," అన్నాను.

"నిజంగానా? సరే, అయితే." అన్నాడు రాజు.

నేను బంగరు మంచంమీద కూర్చుని వుండగా, నాకొడుకు వచ్చి కోరినవన్నీ తెచ్చియిచ్చాడు. వాడి ఒళ్ళంతా చెమట. ముఖం కోపాన కెంపుదీరివుంది. వాడు తెచ్చిన కానుకను చూడనైనా చూడలేదు నేను. అది నా పాదాల కడపడి వుండిపోయింది. ఎంతో అవమానం అనుభవించసాగాను - అవమానం.

ఆనాటినుంచి నాకేమయిందో నాకే తెలియదు. ఒంటరిగా కూర్చుని వుంటాను. ఎవ్వరూ పలకరించకూడదు. నా నోరు విప్పనే విప్పను.

"ఏమిటి సంగతి? ఇంకా ఎందుకిట్లా బాధపడుతున్నావు? ఏమికావలెనో చెప్పు, చిటికెలో సమకూరుస్తాను," అంటాడు రాజు.

ఏమికావలెనో నాకే తెలియదు. కాబట్టి ఆయనకు జవాబు చెప్పలేను.

రాజుగారి మనసుకెక్కిన రాణిని కావచ్చు. కాని నాకు నిజంగా ఏది కావలెననివుందో, అది బయటికి చెప్పలేను. చెప్పితే తలవంపుగా వుంటుంది. నా రహస్యం నీకు చెప్పివేస్తాను; తొలి రాణీ పడేబాధ, అనుభవించే దుఃఖం - యివే నాకు కావలసింది." అన్నది రాణి. ఇష్టసఖి ఆశ్చర్యపోయి, నుచ్చరకొట్టింది.

"అరె! అదేమికోరిక! అరరె!," అన్నది.

"ఆ తొలిరాణిగారి రెల్లు పిల్లనగ్రోవి సంగీతాన్ని ఒలకబోస్తూవుంటే, నా చేతి బంగారు వేణువు నాకే బరువుగామారింది. ఎంతో గర్వంగా దానిని చేదాలుస్తూ, ఎంతో భద్రంగా దానిని పదిలపరుస్తూ వచ్చాను కాని ఏం లాభం? దానిలోనుండి సంగీతాన్ని పుట్టించలేకపోయాను." అన్నది రాణి.

# దేవతా సుందరి

రాజకుమారుడికి పెళ్ళియీడు వచ్చింది. అక్కడనుంచి, ఇక్కడనుంచి, పెళ్ళి సంబంధాలు రాసాగాయి.

"బాహ్లీక దేశపు రాజకుమారి అందాల బరిణ. తెల్లగులాబి పూలమాల లాగుంటుంది." అంటాడు పెళ్ళిళ్ళపేరయ్య ఒకడు.

రాజకుమారుడు ముఖం మరొకవైపుకు తిప్పుకొంటాడు.

"గాంధారదేశపు రాకుమారి చిలకలకొలికి! ద్రాక్షపళ్ళ గుత్తి వలె నిండుగా, సుకుమారంగా, చూడముచ్చట కొలుపుతుంది," అంటాడు రాజదూత.

వేటపేరుబెట్టి రాజకుమారుడు అడవికి పోతాడు. చాల కాలానికిగాని తిరిగిరాడు.

"కాంభోజదేశపు రాకుమారి చక్కనిచుక్క. ప్రొద్దుటిపూట అర్ధవలయాకృతిగా వంపుదీరిన దిగంతంవలె వుంటాయి ఆమె కనుబొమలు. వెలుగునిండిన మంచుబొట్లు ఆమెకళ్లు," అని వర్ణిస్తాడు ఒక ఆస్థానికుడు.

రాజకుమారుడు ఏదో కావ్యం తిరగ వేస్తాడేగాని తలయెత్తి చూడనైనా చూడడు.

"నాకేమీ బోధపడకుండా వుంది. మంత్రి కుమారుణ్ణి పిలి పించండి," అంటాడు రాజు.

మంత్రి కుమారుడు వచ్చి నమస్కరించి, నిలుచుంటాడు.

"నీవు నా కుమారుని చెలికాడవు. పెళ్ళి పేరెత్తితేనే ముఖం త్రిప్పు కుంటున్నాడే, ఎందుచేత?" అని రాజు ప్రశ్నిస్తాడు.

"ప్రభూ, దేవతాసీమగురించి ఏనాడైతే రాజకుమారుడు విన్నాడో, ఆనాటినుంచి తాను దేవతాసుందరిని తప్ప మరెవ్వరినీ పెళ్ళాడనని శపథం చేశాడు," అని మంత్రికుమారుడు జవాబు చెప్పాడు.

దేవతాసీమ గురించి అన్ని విషయాలు క్షుణ్ణంగా తెలిసికో వలెనని, వయస్సులోనూ, తెలివిలోనూ ముదురుమాగిన బుద్ధిలు గల పండితులను పిలిపించాడు రాజు. వాళ్ళు పుస్తకాలను పారి జూచి చూచి, "ప్రభూ, దేవలోకం గురించి కావలిస్తే బోలెడంత గ్రంథముందికాని, దేవతాసీమ గురించి అక్షరం ముక్కయినా లేదే," అన్నారు.

వర్తకులను పిలిపించాడు రాజు. "సముద్రాలను దాటాము. ఎన్నోభూములు చూశాము. మిరియాలకోసం సుగంధ దీవులకూ, గంధపు చెక్కలకోసం మళయా దేశానికి పోయాము. కాని దేవతా సీమ ఎక్కడవుందో ఆ దేవుడికే ఎరుక," అన్నారు.

మంత్రికుమారుణ్ణి మళ్ళీ పిలిపించాడు రాజు.

"దేవతాసీమ గురించి అబ్బాయికి ఎవరా చెప్పినవాడు?," అని ప్రశ్నించాడు.

"ఎవరో తిరుగుబోతు పిచ్చివాడు, ప్రభూ! పిల్లనగ్రోవి చేదాల్చి అడవులమ్మట తిరుగుతూవుంటాడు. వేటకు వెళ్ళివుండగా రాకుమారుడు యిదంతా విన్నాడు" అని మంత్రికుమారుడు చెప్పాడు.

ఆ తిరుగుబోతును పిలిపించారు. "దేవతాసీమ ఎక్కడ వుందో చెప్పవోయ్." అని అడిగాడు రాజు.

"తమ రాజ్యపు వుత్తరపు పొలిమేరలో, చిత్రగిరి శిఖరం దిగువ, కామాయక సరస్సు పక్కన వున్నదే దేవతాసీమ." అన్నాడు ఆ పిచ్చి ద్రిమ్మరి.

"దేవతాకన్యలు కంటికి కనిపిస్తారా అక్కడ?," అని రాజు ప్రశ్నించాడు.

కంటికైతే కనిపిస్తారుకాని, మనస్సుకు తెలియరారు. మారువేషాలు తాల్చి సంచరిస్తూ వుంటారు. వదలి వెళ్ళిపోయిన తర్వాతనే, ఓహో దేవతా కన్యకదా, అని సాదా జనం తెలిసికో గలరు. కాని నాసంగతి వేరు. ఏదో రాగాలాపన బట్టి, ఏదో కాంతి కిరణం బట్టి నాకు దేవతాకన్య యిట్టే అవలీలగా అంతు చిక్కుతుంది." అన్నాడు.

రాజుగారికి చిరాకు పుట్టింది, "పిచ్చి! వెర్రి! ఇతగాణ్ణి పంపించి వేయండి," అన్నాడు రాజు.

ఇదంతా విని, రాజకుమారుడు పిచ్చివాడి మాటలలో గురి కుదుర్చుకొన్నాడు.

వసంతకాలపు పూలు రెమ్మలపై ఒకదానినొకటి త్రోసకొంటున్నది. అడవి ధగధగ మంటూ వుంది. గుర్రం ఎక్కి రాజకుమారుడు చిత్రగిరివైపుగా పోతున్నాడు. "ఎక్కడికి యువరాజా పోతున్నారు తమరు?" అని అడుగుతున్నారు ప్రజలు.

రాజకుమారుని మనస్సు పరధ్యానంలో పడివుంది. అందు చేత ఆయన బదులు పలకడమే లేదు.

బండరాళ్ళ మీదినుంచి బుడబుడ చప్పుళ్ళు చేసికొంటూ కొండవాగు ఒకటి గుహలోదూరి, మరికొంతదూరాన పలచటి తేట వూటగా మారి ప్రవహిస్తుంది. దాపులోనే, నిర్జనమైవున్న దేవాలయమే రాజకుమారునికి ప్రస్తుతం నివాస మందిరమయింది.

ఒక నెలరోజులు గడిచాయి. చెట్ల ఆకుల వన్నె మిడిచింది. అడవిలో వాడినపూలు రాలి రాసిపడివున్నాయి. ఒక రాత్రిపూట, నిదురలో రాజకుమారుడు కలగన్నాడు. కలలోఏదో దివ్యసంగీతం విన్నాడు. విని లేచి కూర్చున్నాడు. "ఏమి మాధుర్యం ఏమిరాగం! అయితే, యీనాడే నా సుందరి ప్రత్యక్షమవుతుంది. అయితీరు తుంది," అనుకొన్నాడు.

తెల్లవారినతోడనే, ఒక్క వుదుటున గుర్రంమీదికెక్కి కూర్చున్నాడు. ఏటిగట్టును అంటిపెట్టుకొనిపోయాడు. పోయిపోయి కామాయక సరస్సును చేరుకొన్నాడు. ఆ కోనేటిగట్టున దేశదిమ్మరుల యింటిపిల్ల తామరపూల ప్రక్కకూర్చునివుంది. కడవ నింపుకొనివుంది. నల్లటి జుత్తులో తెల్లటి దిరిసెన పూవు ఆకాశంలో చుక్కవలె ఒప్పివుంది.

చూచాడు రాజకుమారుడు. గుర్రంమీదినుంచి నేలకు దూకాడు, "దేవతాకన్యా, నీ సిగలోని పూవు యిస్తావా?," అని అడిగాడు.

ఆపిల్లకు జడుపు దడుపులేనీ లేనట్లున్నాయి. లజ్జ, సిగ్గు కూడాలేనట్లున్నాయి. మెడవంచి, రాజకుమారుణ్ణి తదేకంగా

చూడసాగింది. అసలే నల్లని కళ్ళేమో, వాటిలో మరింతనల్లని నీడ వ్యాపించసాగింది. ఒక మబ్బుమీద యింకొక మబ్బు కమ్ముకుంటే ఎట్లావుంటుందో, ఆమె కళ్ళనల్లన అట్లావుంది. సిగనుంచి పూవును తీసి, "ఇదినీది," అని యిచ్చివేసింది.

"ఏదేవతవో నీవు, చెప్పవూ?," అని రాజకుమారుడు అడిగాడు. ఆమె ముఖంలో ఆశ్చర్యం తళతళలాడింది. దాని తర్వాత, వున్నట్టుండి మేఘం విచ్చుకొన్నట్లుగా, వానజల్లువంటి నవ్వు ప్రారంభమైంది. సంగీతంవంటి నవ్వు. గుండెలలో మారుమోగే నవ్వు. తానుకన్న కల యదార్థమయిందని అప్పుడు తెలిసికొన్నాడు రాజకుమారుడు. తాను కలలోవిన్న రాగాలాపనకూ యీ నవ్వుకూ అట్టే తేడాలేదు!

గుర్రం ఎక్కాడు. చేయి చాచాడు. భయముగాని, తొణుకుగాని, తొట్రుబాటుగాని లేకుండా, చాచినచేతి వూతాన గుర్రమెక్కి కూర్చుంది ఆపిల్ల. కడవ వున్నచోటనే వుంది.

"దేవతా సుందరీ నీ పేరు చెప్పి, మారువేషం తీసి వెయ్యవూ?," అని అడిగాడు రాజకుమారుడు.

"కజోరీ అంటారు నన్నందరూ. దిమ్మరులయింటి పిల్లలం మేము, మారువేసాలు ఎరగము." అన్నది.

నిర్జనమైవున్న దేవాలయాన్ని చేరుకొన్నారు. "కావచ్చు. కాని, నీ దివ్యసుందర వదనారవిందం చూపవా, ప్రేయసీ?" అని అడిగాడు రాజకుమారుడు.

దివ్యసుందర వదనారవిందం! మళ్ళీ, తెరిపిలేని జల్లువంటి నవ్వు మొదలుపెట్టింది. ఈపాటికి రాజకుమారుడికి నమ్మిక పూర్తిగా ఏర్పడింది.

"నా కలలోని రాగాలాపనకూ యీ నవ్వుకూ తేడాయేలేదు. దేవసుందరి సాక్షాత్కరించింది, కనికరించింది, వరించింది, నాదై పోయింది," అనుకొని పుబ్బిపోయాడు రాజకుమారుడు.

రాజుగారికి యీ కబురు తెలిసింది. నిర్జనదేవాలయానికి గుర్రాలు, ఏనుగులు, రథాలు పంపాడు.

"ఈవేళ మనం నగరికి పోతున్నాం, తెలిసిందా కజోరీ?" అన్నాడు రాజకుమారుడు.

కజోరీ కళ్ళు చెమ్మగిల్లాయి. కోనేటిగట్టున తాను వదిలి వచ్చిన కడవ గుర్తుకొచ్చింది. ఇల్లు గుర్తుకొచ్చింది. రాజకుమారుడి వెంట తాను బయలుదేరిన సమయానికి అన్నయ్యా, నాన్నా వేటకు వెళ్ళివున్నారు. ఈపాటికి తిరిగి వచ్చివుంటారా? తాను లేచివచ్చినవేళ, తనకు పెండ్లికానుక యిద్దామని, గుడ్డ నేస్తూ వుండింది. ఇంకా నేస్తూనేవుందేమో పిచ్చితల్లి? దిమ్మరుల యింటి ఆడపడుచైన కజోరీ చాలాసేపు ఆలోచించి, "నేను నీతో రాలేను" అని చెప్పివేసింది.

కాని, వినేవాళ్ళెవరు? కొమ్ముల మోతలో, గుర్రాలు డెక్కల చప్పుడులో, ఆమె మాటలు మునిగిపోయాయి.

రాచనగరి చేరుకుంది. రాణిగారు కోడలు పిల్లనుచూచి "ఇదేమి దేవత, యిదేమిరూపు?," అని నోరు నొక్కుకొన్నది.

రాకుమారి వచ్చి, వదినను చూచి "ఎంత తలవంపు!," అనుకొన్నది. చెలికత్తెవచ్చి, కాబోయే రాణినిచూచి, "దేవతా సుందరి. వేసుకొన్న దిరుసుచూడండి, ఎంతచక్కగావుందో," అని గుసగుస లాడింది.

రాజకుమారుడు అందరినీ నోళ్ళుమూయమన్నాడు: "దేవతా కన్య మారువేషంలోవుంది సుమా!," అన్నాడు.

రోజులు గడిచాయి. వెన్నెల రాత్రులలో, నిద్రమాని పడక మీద కూర్చునేవుంటాడు రాజకుమారుడు. ఏ శుభసమయాన దేవతాసుందరి నిజరూపం ధరిస్తుందోనని ఎప్పటికప్పుడు ఆశతో ఎదురు చూస్తుంటాడు. చెదరిన తలజుత్తు దిండుమీద కుప్పబడి వుంది. అందరు స్త్రీల లాగేవుంది. "ఎప్పుడు, యింకా ఎప్పుడు అసలు రూపం చూపుతుందో నా ప్రేయసి ?," అనుకుంటూ వుంటాడు రాజకుమారుడు.

చెలికాళ్ళూ, చుట్టాలూ అనే మాటలుతలనొంపు కలిగిస్తున్నాయి. కోపం తెప్పిస్తున్నాయి. ఒక రోజుపొద్దున, కజోరి నిద్రలేచి, ప్రక్కదిగి వెళ్ళిపోబోతున్నది. రాజకుమారుడు ఆమె చేయిపట్టుకొని. "ఈవేళ నీ అసలు రూపు బయలు పెట్టేంతవరకూ నిన్ను వదలను, తెలిసిందా?," అని కటువుగా అన్నాడు.

ఆమెకు యిప్పుడు వచ్చింది నవ్వుకాదు - ఏడుపు.

"ఈ మారువేషంతోటి నన్ను కలకాలం మోసగిస్తామను కొంటున్నావా? ఇక వీలుపడదు," అన్నాడు.

"నిజమే. త్వరగా ముగింపుకు వస్తుందిలెండి," అన్నది.

"అయితే, రేపు వచ్చే పౌర్ణమనాటికి నీ దివ్యసుందర వదనారవిందం అందరికీ కనువిందు కలిగించాలి. ఏమంటావు?," అన్నాడు.

రాకాచంద్రుడు ఆకాశపు నటకొప్పుకు ఎక్కివస్తున్నాడు. రాచనగరిలోని గాలిమీదుగా సంగీత ధ్వనులు జోగుతూ తూగుతూ తేలిపోతున్నవి. రాజకుమారుడు పెళ్ళికుమారుడుగా ముస్తాబై, పూలమాల చేతబట్టుకొని తన మందిరానికి విచ్చేశాడు.

కుంద పుష్పాలు నేలమీద ఎగాదిగా పడివున్నాయి. వెన్నెల బాట ఒకటి గచ్చుమీద పరచుకొనివుంది.

దేవతావధువేది? కజోరీ ఏమైంది? ఎటుపోయింది? ఎక్కడాలేదు. వెళ్ళిపోయింది.

పశ్చిమాన చందమామ దిగజారిపోయాడు. రాత్రి రెక్కలు కట్టుకొని ఎగిరిపోతూవుంది. రాజకుమారుని శయ్యా మందిరం చుట్టాలతో, చెలికాళ్ళతో కిక్కిరిసిపోయింది. దేవతా వధువేది?

"దేవతాసుందరి కంటికి కనుపించినా, మనస్సునకు తెలిసిరాదు. వెళ్ళిపోయిన తర్వాతనే ఓ దేవతాసుందరికదా అని తెలుసుకుంటాము. పోయిన తర్వాత చేసేదేమి? అయిపోయింది— పోయింది—," అని రాజకుమారుడు వాళ్ళకందరికీ వివరించి చెప్పి, నిట్టూర్పు విడిచాడు.

# రాక

ఏర్పాట్లు జోరుగా సాగిపోతున్నాయి. ఇవంతా దేనికోసమో అని ఆలోచించవలెనంటే, క్షణమైనా తీరికలేకున్నది.

ఇంత పని తొందరలో వుండికూడ, "ఎవరైనా రాబోతున్నారా ఏమిటి?," అని నేను నా మనస్సును అడిగాను.

"తమాయించవయ్యా, తమాయించు. ఎంతపనివుందీ. ఏమికతా! ఖాళీజాగా చూడాలి. ఆక్రమించాలి. కావలసిన వస్తువు

అన్నీ సేకరించుకోవాలి. ఇల్లు కట్టించాలి, ఇంత పనివుంటే, పనికి మాలిన ప్రశ్నలువేసి చిరాకు పుట్టిస్తావెందుకు? ఊరకుండవయ్యా", అన్నది నా మనస్సు.

నోరు మూసికొని. తిరిగి పనిలో పడిపోయాను. జాగాను చూచి, ఆక్రమించి, వస్తువులు సేకరించి, యిల్లు కట్టినతర్వాత నా ప్రశ్నకు సమాధానం వస్తుందిలే. అనుకొని ఊరటపొందాను.

పోనుపోను, జాగా విస్తరించుకొనిపోతూవుంది. వస్తువులు పోగుపడుతూవున్నాయి కట్టడం పైకి పైపైకి లేస్తూవుంది. "మరి యిప్పుడైనా నా ప్రశ్నను చిత్తగిస్తావా?", అని అడిగాను.

"తమాయించు బాబూ. తొందరపడకు. నాకింకా పనితెమల డంలేదు." అన్నది నా మనస్సు.

"అదేమి? ఇంకా జాగాకావాలా? ఇంకా గదులుపెట్టాలా? ఇంకా ఘనంగా వుండాలా కట్టడం?." అని అడిగాను నేను.

"ఉండనక్కరలేదూ?," అన్నది మనస్సు.

"ఉన్నది చాలదా ఏమిటి?." అన్నాను నేను.

"ఇది చాలదులేవయ్యా. నీకు తెలియదు" అన్నది మనస్సు.

"దేనికి సరిపోదు? ఎవరు వుంటారు యిందులో?" అన్నాను నేను.

"ఇప్పుడు కాదు. ముందుముందు చెప్పుతానులే!" అన్నది మనస్సు.

"నీవు ఎవరిని గురించో మాట్లాడుతున్నావు - ఆయనకు యిది చాలదంటున్నావు - ఎవరాయన, మహాకాయుడా ఏమిటి?," అని అడిగాను.

"మరేమిటనుకొన్నావు?," అన్నది మనస్సు.

ఒక్కడట! ఆ ఒక్కడికి యింతజాగా వాలపట! కొత్త పుత్సాహంతో తిరిగి పనిచేయసాగాను. తినడానికి నిదురపోవటానికికూడ తీరుబాటు లేదు. నన్ను చూచిన ప్రతిఒక్కడూ, "ఎంత గట్టిపనివాడు! సెభాష్, నికరమైన నరుకు!," అని మెచ్చుకొనేవారు.

కాని అప్పుడప్పుడు అనుమానం కత్తిపోటులాగ గుచ్చుకొని పోతుంది. ఈ హడావుడి అంతా ఎందుకో. మనస్సుకే తెలియదేమో! నేను వేసిన ప్రశ్నకునేరుగా జవాబు యివ్వకుండా, పని వున్నదనే సాకుతో, తప్పించుకొని పోతున్నదేమో! అనుమానం మెదిలితేసరి, ఎక్కడి పని అక్కడఆపి, చెవులురిక్కించి, ఎవరో నడచిరాబోతున్నట్లు, శ్రద్ధగా ఆలకిస్తాను. ఈ కట్టడం యింతటితో ఆపి, గదులలో దీపాలు వెలిగించవలెనని, యింకా సామానులు సేకరించడం మాని, కొత్తకరకు మాయని పూలతో మాల కట్టవలెనని నాకు అనిపిస్తుంది.

కాని నాకు అంత తెగింపులేదు. ఎందుచేతనంటే, మనస్సే నాకు ముఖ్యమంత్రి. రేయింబగళ్ళు, తూనికలతోబాటు తూస్తూ, కొలబద్దలతోబాటు కొలుస్తూ, అంచనాలు వేస్తూ, విలువలు కట్టుతూ వుంటుంది. "ఇంకా కావాలి, ఇకెంతో ఎంతోకావాలి", అంటూనే వుంటుంది ఎప్పటి కప్పుడు.

"ఎందుకు యింకా ఎందుకు?," అని అడుగుతాను నేను.

"ఆయనకు యిది చాలనే చాలదు," అంటుంది మనస్సు.

"ఎవరంత ఘనుడు?," అంటాను నేను.

జవాబు చెప్పదు.

అదే ప్రశ్న మళ్ళీ వేస్తేచాలు, నా మనస్సు కారాలు మిరియాలు నూరి, కస్సు బుస్సుమంటుంది. "ఎందుకు చెప్పాలి నీకు?

ఊరూ పేరూలేదు, వింతలలో దాక్కొనివున్నాడు, ఎవరూ ఎరుగరు కాబట్టే విర్రవీగుతున్నాడు - అలాంటి అజ్ఞేయుణ్ణి, అనామకుణ్ణి, మాయాజీవిని గురించి చిలిపి తులిపి ప్రశ్నలువేస్తూ కూర్చుని నా దుంపతెంచుచున్నావు. కంటికి స్పష్టంగా కనుపించే దానిమీద శ్రద్ధ చూపకుండా, అగోచరుణ్ణి గురించి కిందుమీదౌతా వెందుకు? సన్నాహాలు చూడు, యుద్ధసంరంభాలవలె వున్నాయి. ఇటుచూడు, గుట్టబడివున్నాయి. సంభారాలూ సామగ్రులూ. నిర్మాణపుగొడవా, గడబిడ విసురు, వూపూ! ఎంత కష్టపడి సాధిస్తున్నాం. ఈ సాధనలో ప్రతి దానినీ నీవు చూడగలవు, తాకగలవు, అనుభవించగలవు. ఊహాలతో పనిలేదు. కొండ గుర్తులనూ, కనుసైగలనూ మామూలు మాటలలోకి మార్చుకోవలసినపనిలేదు. ఇంతపనివుండికదా, ప్రశ్నలువేస్తూ వున్నావేం?," అన్నది మనస్సు.

విన్నాను. బుద్ధివచ్చింది. మనస్సు చెప్పిన ప్రతిపలుకూ బంగారు తునక. రోజువారీ పనిలో తిరిగి పడిపోయాను. రాళ్ళు మోస్తూ, సున్నం కలుపుతూ, కాలం వెళ్ళబుచ్చాను.

ఇలా గడిచిందికాలం, ఆకాశం కనిపించే మేరవరకూ యింటిజాగా విస్తరించుకోసాగింది. అరో అంతస్థుమీది కప్పువేస్తున్నారు. ఆ సమయాన, ఒకానొకరోజున, వాన కారుమబ్బులు పలచబడి, వున్నివలె తెల్లగా తిరిగినై. ఎక్కడో దూరానవున్న పర్వత సరస్సునుంచి, సెలవు ప్రకటనను తీసికొని, వచ్చిందిగాలి. పూలతేనె వాసనతగిలి యిటూ అటూ యెగిరే తేనెటీగలవలె పగటి పూటా, రాత్రిపూటా నిమిషాలు గడచిపోతున్నవి. కళ్ళెత్తిచూశాను. ఎంతో ఎత్తునవున్న ఆకాశం నా కట్టడం మీదికివంగిచూచి, అవహేళనగా బిగ్గరగా నవ్వసాగింది.

నా మనస్సు మనస్సులోలేదు. కలతపడివున్నాను. దీని భావమేమిటో తెలుప వలసినదని కనుపించిన ప్రతిఒక్కరినీ అడిగాను. పుక్కిటి పురాణాలకు కాలక్షేపాలకు ఎవరికీ తీరుబాటులేదు.

ఎవరో ఒక తిరుగుబోతు చెట్టుబోదెకు వీపాన్చి కూర్చుని వున్నాడు. గజిబిజిగావున్న తలవెంట్రుకలకు పూలమొగ్గలదండను చుట్టుకొన్నాడు. అతనినడిగాను.

"స్వాగత సంగీతమయ్యా, తెలియదూ?," అన్నాడు పనదు తెలిసిపోయినట్లు.

ఈ మాటలకు ఏమిటో తాత్పర్యం? "స్వాగతమా? అయితే సమయం ఆసన్నమైన దన్నమాట?" అన్నాను.

వెంటనే, ధూళిరేపుతున్న కట్టుపనిలో దూకిపడ్డాను.

"పని ఆపివేయండి," అన్నాను.

మనస్సు నామాటలకు అడ్డువచ్చింది, "ఇదేమిటి? మనమంతా సోమరిపోతులని పేరుపడతాం! జాగ్రత్త!" అని హెచ్చరించింది.

"అనేవాళ్ళను అననీ." అన్నాను నేను.

మనస్సు ఆశ్చర్యానికి మితిలేదు. "ఏమిటి నీవ్యవహారం యిట్లావుంది? సందేశం అందిందా ఏమి, నీకు?," అని అడిగింది.

"అందుకొన్నాను", అని చెప్పాను.

"ఏమని వచ్చింది సందేశం?," అని అడిగింది మనస్సు.

ఇక్కడేవుంది వున్న చిక్కుయావత్తు. ఏమని తెలియ చెప్పను? ఫలానా ఫలానా అని నికరంగా చెప్పలేకున్నాను. అయినా, సందేశం రానేవచ్చింది. ఎంతో దూరానవున్న పర్వత సరస్సునుంచి, కాంతి వెల్లువల బాటమీదుగా, అంచలపిందు దక్షి

జానికి వచ్చింది. అవి యిక్కడికే విచ్చేశాయి. తమగమ్యానికి వచ్చేశాయి.

కాని మనస్సు యింకా నమ్మలేదు. "అంతా బాగానేవుంది. కాని ఆ మహామహుడు రథమెక్కి వస్తాడుకదా? మరి ఆ రథపు టెక్కెం ఆకాశాన్ని అంటేటంత ఎత్తున వుంటుందాయెనే, ఏది అది కనుపించదే? తూర్యఘోషఏదీ? ఏదీవినిపించదు. ఏదీ కని పించదు," అని ఆక్షేపించింది.

మనస్సు మాట్లాడుతూనేవుంది. ఇంతలోనే, గారడీవాని గీటురాయి తాకిడికి మారినట్లుగా, ఆకాశం బంగరు వన్నెకు తిరి గింది. దాని శుద్ధకాంతి మిలమిలలాడే అలలుగా పొంగిపోయింది.

"సందేశహరుడు అరుదెంచినాడు," అంటూ అన్ని గొంతులూ ఏకశ్రుతిలో పలికాయి.

అగోచరమైన దానికి సమస్కార పూర్వకంగా నేను తల వంచాను. "ఇదేనా ఏర్పాటైన ముహూర్తం?," అని అడిగాను.

"ఇదే ముహూర్తం ఇదే," అని అన్నికడలనుంచి జవాబు వచ్చింది.

మనస్సు కలవరపడసాగింది. "ఏమిచేయాలి యిప్పుడు? ఆరవ అంతస్తుమీద యిప్పుడేకదా కప్పువేసింది; పూర్తికావలసింది మరెంతైనావుందికదా, ఏమిచేతును?—" అని చింతించసాగింది.

"ఊడబెరికివేయండి. నేలమట్టం చేసివేయండి" అని పిడుగుమ్రోతవలె వచ్చింది జవాబు.

"అదేమి? ఎందుకు కూల్చివేయాలి?," అని అడిగింది మనస్సు. ఆశ్చర్యం పట్టలేక.

"వస్తున్నారు కాబట్టి. పొగరుబోతువలె తలయెత్తిన యీ కట్టడం దారికి అడ్డుగావుందికాబట్టి." అని వచ్చింది జవాబు.

మునుపటికంటె ఎక్కువ ఆశ్చర్యపడింది మనస్సు.

"ఈ సన్నాహాల నన్నిటినీ తుడిచిపెట్టండి - అన్నిటినీ." అని మళ్ళీ ఫెళఫెళార్భటివలె వినవచ్చింది.

"అయ్యో. ఎందుకీ విధ్వంసం?." అని ఏడువసాగింది మనస్సు.

"ఎందుకా? ఉన్నస్థలాన్ని అంతటినీ యీ కట్టడం దురాక్రమించింది కాబట్టి," అని వచ్చింది జవాబు.

ఇదన్నమాట సంగతి! ఎంతో కష్టపడి, రోజులంతరబడి రెక్కలు విరుచుకొని, యీ మహానిర్మాణంలో పాటుపడ్డాను. ఇప్పుడు సెలవు వచ్చింది. రాయికి రాయి, గోడకు గోడ, అంతస్తుకు అంతస్తుగా యీ కట్టడాన్ని కూల్చివేయాలి. సాధనసామగ్రిని ఎంతకష్టపడి సమకూర్చానో, వాటి పీడ వైదొలగించుకోవడానికి అంత కష్టపడాలి!

ఆకాశాన్ని అంటేటంత ఎత్తు కెక్కేముందోటి రథం విజయం చేయలేదే? తూర్యఘోష వినిపించదే? ఈక్షణమో మరుక్షణమోనని మనస్సు సాతురమై ఎదురు చూస్తున్నది. ఆ మహావైభవమంతా ఎక్కడవుంది?

ఇంతలో, వానలు తుడిచిన గగనాన వేగుచుక్క కనిపిస్తుంది.

ఇంతేనా, చివరకు, అంతాచే?

శేఫాలికాసుమాలు విచ్చుకొంటున్నవి.

ఇంతేనా, చివరకు, అంతాచేరి?

చిన్నారి చిట్టి పిట్ట రెమ్మమీద వ్రాలికూర్చుంది.

ఇంతేనా, చివరకు, అంతాచేరి? మరేమీ అదనంలేదా?

కన్నతల్లి ఒడినుండి జారి, దోకాడుతూ, నవ్వులొలికించే ముఖం తోటీ, వరద ముంచెత్తినట్లున్న ఎండలోకి, వస్తున్నది పాపాయి.

"మనమంతా కళ్ళకు వత్తులు పెట్టుకొని ఎదురుచూచినది యిదేనా? ఇంతాచేసి యిదేనా చివరకు?" అన్నది మనస్సు.

"అవును. ఇదే! ఉదయ ప్రభా శోభ, ముందు నడువగా, దినదినమూ యిదే చనుదెంచేది!" అని వచ్చింది జవాబు.

"అనంతస్థలావకాశానబడి దిక్కుమాలిపోవడానికా?" అని అడిగింది మనస్సు.

"అధికార దర్పానికి కావాలి ఏడంతస్తుల మహా భవంతి. పరిపాలనాధికారానికి కావాలి రథాలు, వాహనాలు, తూర్యఘోషలు మొదలైన పటాటోపాలు. కాని, చుక్కలకూ, పూలకూ, పిట్టలకూ పాపలకూ యివేవీ అక్కరలేదు, విశాలమైన స్థలావకాశం వుంటే చాలు. భూమిలో వున్నచోటు ఒక్కటే చాలదు. ఆకాశపు జాగా కూడా కావాలి. అంతా కావాలి" అని వచ్చింది జవాబు.

"మరి, మహామహుడికో?," అని అడిగింది మనస్సు.

"భూమ్యాకాశాల మధ్య స్థలమంతా కావాలి", అని వచ్చింది జవాబు.

"ఈ పసివాడు ఏ కానుక యివ్వగలడు? ఏ బ్రహ్మానందం అనుభవించగలడు?" అని అడిగింది మనస్సు.

"మనందరికీ బ్రహ్మానంద మార్గాన్ని చూపుతున్న మార్గదర్శి మరెవరనుకొన్నారు? ముందువాళ్ళపై ఆశ, సుఖసంతోషాలు అన్నీ యితనిచ్చే కానుకలే. ఇతని అమ్మల పాటలో మంచిమంచి బటువైన బాణాలు ఎన్నెన్నోవున్నాయి." అని చెప్పింది జవాబు.

"కవీ. ఏమేమి చూశావోయ్ నీవు? ఏమి గ్రహించావు వివరము?" అని ప్రశ్నించింది నన్ను నా మనస్సు.

"ఇన్ని రోజులనుండీ అమూల్యమైన కాలమంతా బింద చాకిరికి వినియోగపెట్టాను. చూచి, గ్రహించడానికే తీరిక లేక పోయింది. అందుచేతనే యిప్పుడు సెలవు తీసుకొన్నాను." అని చెప్పాను, నేను.

Rs. 2-0-0
P.B.H.
19.2.62

★